# భగవద్గీత

## సంక్షిప్త సంపూర్ణ గీతా సారము

(వచన రూపములో)



# భగవద్గీత

**సంక్షిప్త సంపూర్ణ గీతా సారము (వచన రూపములో)**


గ్రంథ కర్త : **రావూరి వెంకటేశ్వర్లు** B.E

Flat No. : 205, మహాలక్ష్మి ఆర్కేడ్, బి-బ్లాక్,

మదీనాగూడ, హైదాబాద్ - 500049

Cell : 9398870210, 9949795369



ముద్రించినవారు : భారత్ ఆర్ట్ ప్రింటర్స్

అశోక్ నగర్,

రామచంద్రాపురం,

హైదరాబాద్,

ఫోన్ : 9052095000.

వెల : రూ॥ 50/-





ప్రథమ ముద్రణ : సెప్టెంబరు 2018

## మనవి

భగవద్గీత మొత్తము 700 శ్లోకములతో గూడి 18 ఆధ్యాయములుగా నున్నది. మొదటి ఆరు ఆధ్యాయములు కర్మషట్కటమనియు, తరువాత ఆధ్యాయములు (7 నుండి 12 వరకు ) భక్తి షట్కటమనియు, మిగిలిన ఆరు ఆధ్యాయములు (13 నుండి 18 వరకు) జ్ఞాన షట్కటమనియు అందురు. ప్రతి మానవుడు జీవితంలో ఒక్క సారయినను భగవద్గీతను చదివినచో జీవితానికి అర్ధము పరమార్ధము లభించగలదు.
ఈ **“సంక్షిప్త సంపూర్ణ గీతాసారము”** అనుగ్రంధము అందరికి చదువుటకు అందుబాటులో వుండుననే ఉద్దేశ్యంతో వచన రూపంలో రచించబడినది. కొన్ని ముఖ్యమయిన కొన్ని శ్లోకములు గూడా పొందుపరచటమైవి. 700 శ్లోకములతో గూడిన భగవద్గీతను చదువుట చాలా శ్రమయని భావించి చాలా మంది దానిని గురించి అసలు పట్టించుకోరు. 21 సంవత్సరములు క్రితము దాదాపు 780 పేజీలు గల భగవద్గీతను నేను చదువలెనని సంకల్పించి కొన్నప్పుడు చాలా మంది ఇది చదవటానికేనా అన్నారు.

కాని ఏ పనిని చేయాలన్నా ఒక అడుగు ముందుకేస్తేనే గాని రెండవ అడుగు పడదు. ఆ విధంగా సంకల్పించి నేను దాదాపు 3 మాసములలో పూర్తిగా భగవద్గీతను చదువగలిగాను. ఆ తరువాత ఎన్నో గ్రంధాలు ఎన్నో మార్లు చదివాను. నా అనుభవంతోనే నేను ఈ చిన్న గ్రంధాన్ని అందరికి చదువుటకు అందుబాటులో వుండే విధంగా వచన రూపంలో రచించి మీ ముందుకి తెచ్చాను. ఇక చదవటమా । లేదా । అనేది మీ నిర్ణయంపై ఆధారపడి వుంటుంది. .కాని ఒక్క మాట -శ్రీ కృష్ణ పరమాత్మ అనుగ్రహం లేనిదే భగద్గీతను చదవాలని ఎవ్వరికి అనిపించదు. భగవద్గీత ఒక సామాన్య పుస్తకము అని భావించరాదు. అది సాక్షాత్ శ్రీ కృష్ణ భగవానుని ప్రతినిధి. కాబట్టి మీరు భగవద్గీతను చదవండి, చదివించండి, తరించండి. జన్మసార్ధకతను పొందండి.

ఇట్లు

భవదీయులు

**రావూరి వెంకటేశ్వర్లు** B.E.,

# ఓం

## ఉపోద్ఘాతము

దాదాపు 5 వేల సంవత్సరముల క్రితము ద్వాపరయుగాంతమున కురుక్షేత్ర యుద్ధ భూమి యందు శ్రీ కృష్ణ భగవానుడు తన స్నేహితుడు భక్తుడైన అర్జునునకు ఈ భగవద్గీతను ఉపదేశించెను. ఈ సంవాదము ధృతరాష్ట్రుని నూరుగురు పుత్రులు వారి జ్ఞాతులైన పాండురాజు తనయుల మధ్య సంభవించిన ఘోర యుద్ధము ఆరంభమగుటకు కొద్ది సమయము ముందుగా ఈ సంవాదము జరిగినది. ధృతరాష్ట్రుని తనయులు ముఖ్యముగా జ్యేష్టుడైన ధుర్యోధనుడు పాండవులను ద్వేషించి మాయా జూదమున పాండవుల రాజ్యము నపహరించగా వారు 13 సంవత్సరములు (12సం॥లు అరణ్యవాసము మరియు 1 సం॥ము అజ్ఞాతవాసము) గడుపవలసివచ్చెను. అజ్ఞాతవాసము నుండి తిరిగివచ్చిన తరువాత వారి రాజ్యమును తిరిగి యివ్వలసినదిగా అర్థించగా మొండిగా సూది మోపినంత స్థలము కూడ యివ్వనని సమాధానమొసగెను. పాండవుల

సహనము, ఓర్పు నశింపగా యుద్ధము అనివార్య-మయ్యెను.

పరమ ధర్మాత్ములైన పాండవులు శ్రీ కృష్ణుని పూర్ణపురుషోత్తముడైన దేవదేవునిగా గుర్తించిరి. అప్పుడు ఇరువురును (పాండవులు ,కౌరవులు) శ్రీ కృష్టుని యుద్దమున సహాయము కోరగా అంతట శ్రీ కృష్టుడు స్వయముగా యుద్ధము చేయననెను. యుద్ధములో పాల్గొనుటకు తన సైన్యము మొత్తము ఒక భాగముగను తనను ఒక భాగముగను విభజించెను. అప్పడు ఉత్సాహవంతుడైన ధుర్యోధనుడు శ్రీ కృష్టుని సేనా బలమును కోరగా పాండవులు అంతే ఉత్సాహముతో శ్రీకృష్టుని పొందిరి.



(కొన్ని ముఖ్యమైన శ్లోకములు -తాత్పర్యముతో సహా)

1.శ్లో : అశోచ్యా నన్వశోస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూన గతా సూంశ్చ నాను శోచన్తి పణ్డితాః॥ 2-12
(ఈ శ్లోకంతో గీత బోధ ఆరంభమయింది)

తా॥ :- అర్జునా ! నీచర్య చాలా వింతగా కన్పిస్తుంది. మహాజ్ఞానులు వలె ధర్మపన్నాలు వల్లిస్తున్నావు. ఏడవకూడని వారి కొరకు ఏడ్చేమూఢుని వలె శోకిస్తున్నావు. చనిపోయిన వారిని గురించి గాని బ్రతికియున్నవారిని గురించి గాని పండితులెన్నడూ శోకించరు.

2.శ్లో : యత్ర యోగేశ్వర : కృష్ణో యాత్ర పార్థో ధనుర్ధర: ।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతర్మమ ॥ 18- 78
(ఈ శోక్లంతో గీత బోధ సమాప్తమయింది)

తా॥ యోగీశ్వరుడైన శ్రీ కృష్ణుడును, గాండీవాన్ని ధరించిన పార్థుడును ఏ పక్షాన ఉన్నారో, ఆ పక్షానికి సంపద్విజయ ఐశ్వర్యములు, నీతి ఉంటాయని నా యుద్దేశ్యం. అనిసంజయుడు తన నిశ్చయాన్ని దృతరాష్ట్రునకు వివరించారు.

**3.శ్లో :** దేహినోస్మిన్ యధా దేహే కౌమారం యౌవనం జరా ।
తధా దేహాన్తర ప్రాప్తిర్ధీర స్తత్ర న ముహ్యతి॥ **2-13**

**తా॥ :-** ఈ దేహమందు దేహియగువాడు బాల్య, యౌవన, కౌమార వార్ధ క్యావస్థలు పొందే విధంగానే ఈ శరీరాన్ని విడిచిన తరువాత మరియొక దేహాన్ని ఆశ్రయించటం జరుగుతుంది. ఇందు కొరకు ధీరుడైన వాడు మోహాన్ని పొందడు.

**4.శ్లో :** శ్రేయాన్ స్వధర్మో విగుణ: పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయ: పరధర్మో భయావహ:॥ **3-35**

**తా॥ :-** ఇతర ధర్మాన్ని అవలంబించి ఎంతో బాగుగా చేసిన దాని కంటె, దోషంతో నిండియున్నప్పటికి వదలకుండగ తన ధర్మాన్నే ఆచరించటం మంచిది. తన స్వభావాను గుణ్య మైన కర్మచేయటంలో మరణించినను మంచిదే. తన స్వభా వానికి విరుద్ధమైన పరధర్మం భయాన్ని కలిగిస్తుంది.

**5.శ్లో :** పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే ॥ **4-8**

**తా॥ :-** మంచి వాళ్లను రక్షించేందుకు, చెడ్డవాళ్లను శిక్షించేందుకు నేను ప్రతియుగంలోను జన్మిస్తూనే యుంటాను.

6.శ్లో : భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాం శాన్తి
మృచ్ఛతి ॥ 5 -29

తా॥ :- నేనే అన్ని యజ్ఞాలను, తపస్సులను అనుభవించే భోక్తనని అన్ని లోకాలకు ఈశ్వరుడనని, అన్ని ప్రాణులకు ఉపకారినని తెలిసికొన గలిగిన వాడే శాంతిని పొందుతూయుంటాడు.

7.శ్లో : యోగీయుఞ్జత సతత మాత్మానం రహసి స్థిత : ।
ఏకాకీ యత చిత్తిత్మా నిరాశీ రపరిగ్రహః ॥ 6 -10

తా॥ :- యోగి ఏకాంత ప్రదేశమున ఒంటరిగ నున్నవాడై మనస్సును దేహేంద్రియములను స్వాధీన మొనర్చుకోని, ఆశలేనివాడై నుండి యేమియు స్వీకరింపక ఎల్లప్పడును మనస్సును ఆత్మయందే నెలుకొల్పుచుండవలెను.

8.శ్లో : దైవీ హ్యేషా గుణమాయీ మమ మాయా దురత్యయా ।
మామేవయే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే ॥ 7-14

తా॥ :- దైవ సంబంధమైన ఈ మాయ దాటేందుకు శక్యంకాదు నన్ను శరణు బొందిన వారు మాత్రమే ఈ మాయను దాటగలరు.

9.శ్లో : అనన్యాశ్చిన్త యన్తో మాం యే జనా : పర్యుపాసతే ।
తేషాం నిత్యాభి యుక్తానాం యోగ క్షేమం
వహామ్యహమ్ ॥ 9-22

తా॥ :- ఇతర భావాలు లేకుండగ నన్ను స్మరిస్తూ భజిస్తూ ఎల్లవేళల నా యందే మనస్సు నిలిపిన వారి యోగ క్షేమాలు సదా నేను చూస్తూ యుంటాను.

10.శ్లో : అహ మాత్మా గుడా కేశ సర్వభూతా శయస్థిత : ।
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మన్తఏవచ ॥ 10 -20

తా॥ :- అన్ని భూతాల హృదయలలో నున్న ఆత్మను నేను అన్ని భూతాల యొక్క మొదలు, మధ్య, తుది కూడా నేనే .

11.శ్లో : పశ్యమేపార్ధ రూపాణి శతశోధ సహస్రశ: ।
నానా విధాని దివ్యాని నానా వర్ణా కృతీనిచ ॥ 11 -5

తా॥ :- అర్జునా ! అనేక విధములుగ నున్నవియు, అలౌకికము, లైనవియు, వివిధ వర్ణములు, ఆకారములు గలవియు, అసంఖ్యాకములుగ వర్తించునవియునగు నా యొక్క రూపములను గాంచుము.

12.శ్లో : అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యధ: ।
సర్వారమ్భ పరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియ: ॥ 12- 16

తా॥ :- ఎటువంటి ఆపేక్షలేనివాడును, శుచియు, సమర్ధుడును, ఉదాసీనంగా ఉండేవాడును, దేనికీ బాదపడనివాడును, అన్నివిధాలైన పనులయందు కర్తృత్వము వదలినవాడును అయిన భక్తుడంటే నా కెంతో యిష్టం.

13.శ్లో : ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్ ॥ 13 -20

తా॥ :- ప్రకృతి, పురుషుని ఉభయములను ఆదిలేనివారిగ నెఱంగుము, వికారములను గుణములు ప్రకృతి వలన గలిగినవిగా నెఱుంగుము.

14.శ్లో : బ్రహ్మణోహి ప్రతిష్ఠా హ మమృతస్యా వ్యయస్యచ ।
శాశ్వతస్యచ ధర్మస్య సుఖ స్యైకాన్తి కస్యచ ॥ 14 -27

తా॥ :- అవ్యయమును, అమృత స్వరూపమునునగు బ్రహ్మమునకును శాశ్వతమైన ధర్మానికి, చలనం లేని మోక్ష సుఖానికి కూడా నేనే ఆశ్రయ భూతుడను.

15.శ్లో : ఊర్ధ్వమూల మథ: శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।
ఛన్దాంసి యస్యపర్ణాని యస్తంవేద సవేదవిత్ ॥ 15 -1

తా॥ :- అర్జునా! అవ్యమైనదై అశ్వత్థమనే వృక్షంవుంది. దానికి వేళ్ళుమీదికి, కొమ్మలు క్రిందికి వుంటాయి. వేదాలే దానికి ఆకులు. దానిని తెలిసికొన్నవాడే వేదవిదుడు.

16.శ్లో : అహం వైశ్యానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రిత:
ప్రాణాపాన సమాయుక్త : పచామ్యన్నం చతుర్విధమ్॥ 15-14

తా॥ :- వైశ్యానరుడనే అగ్ని రూపంలో ప్రాణుల శరీరంలో ఉండి ప్రాణా పానవాయువులతో కూడికొని వారు భుజించే నాలుగు రకాల ఆహరాన్ని పక్వం చేస్తున్నాను.

17.శ్లో : త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మన: ।
కామ క్రోధస్తధా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజత్ ॥ 16-21

తా॥ :- కామము, క్రోదము, లోభము అను ఈ మూడును నరక ద్వారములు. ఇవి తనకు నాశనము కలుగజేయును.కాబట్టి ఈ మూడును విడనాడవలెను.

18.శ్లో : మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామే వైష్యసి సత్యంతే ప్రతి జానే ప్రియో సమే ॥ 18 -65

తా॥ :- నీవు నా యందే మనస్సు నిలుపు. నాకు భక్తుడవై నన్నారాధించు నాకే నమస్కరించు అపుడు నీవు నన్నే చేరగలవు.



## గీతా మహాత్మ్యం

శ్రీమద్భగవద్గీత చదువగా చదువుగా, ఆచరణలో పెట్టుకోగల సద్ బుద్ధి కలుగుతుంది వరాహ పురాణంలో గీతామాహాత్మ్యం చెప్పబడియుంది. గీతాపారాయణం చేసేవేళ దీనిని పఠిస్తూ ఉండటం సంప్రదాయంగా వస్తూయుండటం అందరికీ తెలిసిన విషయమే ! పారాయణానంతరము కనీసము రెండు శ్లోకములనైనను చదువ వలెను.

**ధరోవాచ : -**

భగవాన్ పరమేశాన భక్తి రవ్యభిచారిణీ,
ప్రారబ్ధం భుజ్యమానస కథం భవతి హే ప్రభో 1

ధరచెప్పింది :-

శ్రీ మహావిష్ణువు చెంతకేగిన భూదేవి తన సందేహాన్ని చెపుతూ “భగవంతుడా ! పరమేశ్వరా ! ప్రారబ్దకర్మ అనుభవించేవారికి పరమాత్మయందు అచంచలమైన భక్తియేవిధముగా కలుగుతుందో చెప్పు” మని అడిగింది. శ్రీ మహావిష్ణువు ఆమె కోర్కెను మన్నించి చెప్పటం ప్రారంభించాడు.

శ్రీ విష్ణురువాచ :-

ప్రారబ్ధం భుజ్యమానో2 పి గీతాభ్యాసరత స్సదా,
స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపల్ప్యతే. 2

విష్ణువు చెప్పాడు : -

దేవీ ! ప్రారబ్ధకర్మల్ని అనుభవించే వారైనప్పటికి, ఎల్లప్పుడు గీతను చదవటం, అభ్యాసం చేస్తూ వుండటం చేసేవారు అన్ని కర్మబంధాలనుండి తప్పించుకొని సుఖంగా నుండగలరు.

మహా పాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్,
క్వచిత్స ర్శం కుర్వన్తి నలినీదల మంభసా. 3

ఎవరైతే గీతాధ్యానం చేస్తుంటారో-వారికి తామరాకునకు నీరు అంటకుండగా ఉండే విధంగా ఏ పాపం కూడా అంటదు.

గీతాయా : పుస్తకం యత్ర యత్ర పాఠ: ప్రవర్తతే,
తత్ర సర్వాణీ తీర్థాని ప్రమయాగాదీని తత్రవై. 4

ఎక్కడ గీతాపుస్తకముంటుందో, ఎక్కడ నియమ పూర్వకంగా గీతాపారయణం చేయబడుతూ వుంటుందో - అచ్చోట ప్రయాగాది సమస్త తీర్థాలూ

వుంటాయి.

సర్వే దేవాశ్చ ఋషయో యోగిన : పన్న గాశ్చ యే
గోపాలా గోపికాశ్చా 2 పి నారదోద్ధవ పార్షదై:
సహాయో జాయతే శ్రీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే. 5

గీతాపారాణం జరిగేచోట సమస్త దేవతలు, ఋషులు, యోగులు, వాసుకి, అనంతుడు, నాగులు, గోపాలురు, గోపికలు, నారదుడు, ఉద్ధవుడు మొదలైన వారందరూ ఉండి సహాయం చేస్తూ ఉంటారు.

యత్రగీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్,
తత్రాహం నిశ్చితం పృథ్వీ నివసామి సదైవ హి. 6

ఓ ధరాదేవి ! గీతావిచారణ, పఠన పాఠన శ్రవణాదులు జరిగే తావునందు నేను నివసిస్తూ వుంటాను.

గీతాశ్రయో2 హం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీ న్లోకాన్పాలయామ్యహమ్. 7

నేను గీతనాశ్రయించి యున్నాను. గీతయే నాకు ఉత్తమమైన మందిరం. ఆ గీతాజ్ఞానం వల్లనే నేను ముల్లోకాలను పాలిస్తున్నాను

గీతామే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయ:
అర్థమా త్రాక్షరా నిత్యా స్వవిర్వాచ్య పదాత్మికా. 8

గీతయే నా యొక్క బ్రహ్మవిద్య, అది పరబ్రహ్మ స్వరూపం. దానికి నాశనం లేదు. అది ప్రణవ (ఓంకార) స్వరూపం. అది చెప్ప వీలులేనిది, సత్యమైనది.

చిదానన్దేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతో2 ర్జునమ్,
వేదత్రయీ పరానన్దా తత్త్వార్థజ్ఞానమంజసా 9

దీనిని చిదానందరూపుడైన శ్రీ కృష్ణుడు స్వయంగా అర్జునునకుప దేశించాడు. ఇది మూడు వేదాలయొక్క సారం -పరమానందాన్ని యిచ్చే తత్త్వజ్ఞానంతో కూడి యుటుంది.

యో2 ష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చల మానస:
జ్ఞాన సిద్ధిం న లభతే తతో యాతి పరం పదమ్. 10

నిశ్చలమైన మనస్సుతో, నిత్యమును 18 అధ్యాయములు పఠించేవారు జ్ఞాన సిద్ధిని పొంది తన్మూలంగా మోక్షం పొందుతారు.

పాఠే2 సమర్ధస్సం పూర్ణే తదర్ధం పాఠ మాచరేత్,
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయ:  11

గీతను పూర్తిగా చదివే శక్తి లేనివారు సగమైనను చదవాలి. దానివలన గోదానం చేసినంత పుణ్యం కలుగుతుందని చెప్పటంలో సందేహం లేదు.

త్రిభాగం పఠమానస్తు గంగాస్నా నఫలం లభేత్.
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్.  12

గీతలోని ఆరు అధ్యాయాలు చదివినప్పటికి గంగాస్నాన ఫలం కల్గుతుంది మూడు అధ్యాయాలు చదివినప్పటికీ సోమయాగఫలం లభిస్తుంది.

ఏకాధ్యయం తు యోనిత్యం పఠతే భక్తి సంయుత :
రుద్రలోక మవాప్నోతి గణోభూత్వా వసేచ్చి రమ్.  13

భక్తితో నొక్క అధ్యాయం చదివినను రుద్రలోకాన్ని పొంది రుద్రగణంలో నొక్కడై అచట చాలాకాలం వుంటాడు.

అధ్యాయశ్లోకపాదం వా నిత్యం య: పఠతే నర:
స యాతి నరతాం యావ న్మనుకాలం వసుంధరే. 14

ఒక అధ్యాయంలో నాల్గవవంతు చదువుతూ వుండినను, అతడు ఒక మన్వంతరం వరకు మానవజన్మననే పొందుతుంటాడు.

గీతాయా : శ్లోక దశకం సప్తపంచ చతుష్టయమ్,
ద్వౌ త్రీనేకం తదర్ధం వా శ్లోకానాం య: పఠేన్న రః 15

గీతా శ్లోకాలలో పదిగాని, ఏడుగాని, ఐదుగాని, నాలుగుగాని, మూడుగాని, రెండుగాని, ఒకటిగాని కనీసం అర్ధశ్లోకం గాని, నిర్మలమైన మనస్సుతో చదివేవారు చంద్రలోకాన్ని పొంది అక్కడ పదివేల సంవత్సరాలుంటారు.

చన్ద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్,
గీతాపాఠ సమాయుక్తో మృతోమానుషతాం వ్రజేత్. 16

గీతాపారయణం చేసేవారు చనిపోయినప్పటికీ తిరిగి మానవజన్మనే పొందగలరు.

గీతాభ్యాసం పున: కృత్వా లభతే ముక్తిముత్తమామ్,
గీతేత్యుచ్చార సంయుక్తో మ్రియమాణో  గతిం లభేత్. 17

గీతాభ్యాసంలో నిమగ్నమైనవాడు ఉత్తమైన ముక్తిని పొందుతాడు. మరణ సమయంలో గీతను స్మరించి నట్లయితే సద్గతి దొరుకుతుంది.

గీతార్థ శ్రవణాసక్తో మహాపాపయుతో2 పి వా
వైకుంఠం సమవాప్నోతి విష్ణువా సమమోదతే. 18

ఎంతటి పాపాత్ముడైనప్పటికిని, గీతార్థం వినటంలో ఆసక్తి కలిగియున్నట్లయితే వాడు వైకుంఠాన్ని పొంది నాతో కలిసి సంతోషంగా వుంటాడు.

గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశ:
జీవన్ముక్త స్సజ్ఞేయో దేహాన్తే పరమం పదమ్ 19

ఎన్ని కర్మలు చేసినప్పటికి, నిత్యమూ గీతావిచారణ చేసినట్లతే అతడు జీవన్ముడౌతాడు. మరణానంతరం పరమపదవిని పొందుతాడు.

గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయ:
నిర్ధూతకల్మషా లోకే గీతా యాతా : పరం పదమ్ 20

జనకాదులు గీతను ఆశ్రయించటం వలననే యిహలోకంలో కీర్తిని పొంది పాపరహితులై ఉత్తమమైన పదాన్ని పొందారు.

గీతాయా : పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ య: పఠేత్,
వృథా పాఠో భవేత్తస శ్రమ ఏవ హ్యుదాహృత: 21

గీతను చదివి దాని మాహాత్మ్యాన్ని చదవక పోయినట్లయితే ఫలితం వుండదు. శ్రమమాత్రమే మిగులుతుంది.

ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి య:,
స తత్ఫల మావాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్‌య. 22

ఈ మాహాత్మ్యంతో కూడిన గీతాభ్యాసం చేసేవాడు నేను చెప్పిన ఫలితాలన్నిటిని పొంది చివరకు మోక్షాన్ని పొందగలడు.

సూత ఉవాచ :-

మాహాత్మ్య మేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్,
గీతాన్తే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్. 23

అని విష్ణుభగవానుడు భూదేవికి చెప్పియున్నాడని సూత మహర్షి చెప్పిన సనాతనమైన, ఆర్షేయమైన, ఈ మాహాత్మ్యాన్ని నేను చెప్పాను. గీతా పారాయణ నంతరమున దీనిని పఠించినట్లయితే చెప్పబడిన ఫలితాలన్ని పొందుతారు అని గీతామాహాత్మ్యమును చెప్పాడు.

ఇది వరాహ పురాణంలో చెప్పబడియున్న
గీతామాహాత్మ్యం
శుభం భూయాత్.
హరి: ఓమ్.

# 1 వ అధ్యాయము

# అర్జున విషాదయోగము

**ధృతరాష్ట్రుడు ఇట్లు పలికెను :-** ఓ సంజయా! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు నాతనయులు మరియు పాండురాజు తనయులు యుద్ధము చేయగోరువారై సమకూడిన పిమ్మట ఏమి జరిగినది? అని అడిగెను.
**అంతట సంజయుడు పలికెను:-** ఓ రాజా! పాండు తనయులచే వ్యూహముగా ఏర్పాటుచేయబడిన సైన్యమును గాంచిన పిమ్మట ధుర్యోధనుడు తన గురువు ద్రోణాచార్యుని చెంతకు చేరి ఓ అచార్యా! దృపదపుత్రుడునూ, నీ శిష్యుడును ధీమంతుడూ నైన దృష్ట ద్యుమ్యుడు పాండవుల సైన్యాన్ని యొక వ్యూహంగా నేర్పాటు చేసాడు. ఆ వ్యూహాన్ని పరికించండి అని చెప్పెను. అదే సమయంలో ధుర్యోధనునికి ఉత్సాహం కలిగించాలని కురు పితామహుడైన భీష్ముడు సింహ్మానాదం చేసి బిగ్గరగా శంఖాన్ని పూరించాడు. వెంటనే కౌరవులంతా తమ శంఖాల్ని పూరించారు.

అంతలో తెల్లని గుఱ్ఱాలు కట్టిన రధం మీద కూర్చొనియున్న కృష్ణార్జునులు తమ దివ్య శంఖాల్ని

పూరించారు .అర్జునుడు దేవదత్తమనే శంఖాన్ని ,కృష్ణుడు పాంచజన్యాన్ని పూరించటం చూచి భీముడు తన పౌండ్రాన్ని , ధర్మరాజు అనంతవిజయమనే శంఖాన్ని , నకులుడు ఘోషాన్ని , సహదేవుడు మణిపుష్పకాన్ని పూరించాడు. అటువంటి సమయంలో కపిధ్వజుడైన అర్జునుడు యుద్ధానికి సిద్ధంగావున్న కౌరవుల్ని చూచి తన గాండీవాన్ని చేతితో పట్టుకొని , “బావా ! మన రధాన్ని రెండు సేనల మధ్యలో నిలుపు“ మని కోరాడు. శ్రీ కృష్ణ భగవానుడు రధాన్ని రెండు సేనలకు మధ్యలోను, భీష్మ ద్రోణులకును సకల మహీపతులకును ఎదురుగా నిలిపి “ పార్థా! యుద్ధానికి వచ్చిన కౌరవబలాన్ని చూడు“ అన్నాడు. అపుడు అక్కడ నిలిచి యున్న తన తండ్రులను, తాతలు, గురువులు ,అన్నదమ్ములు ,కొడుకులు, మామలు, మనుమలు, స్నేహితులు మొదలుగా గల అందరు అర్జునుని కంటపడ్డారు. వారందరిన్ని చూచి జాలి పడి దు:ఖిస్తూ కృష్ణా ! యుద్ధము చేయాలని యిచ్చట గుమిగూడియున్న ఆత్మ బంధువులందరిని చూడటం వల్ల నా మనస్సు తల్లడిల్లిపోతుంది. నా అవయములు పట్టు దప్పుతున్నాయి, నోరు ఎండిపోతుంది ,శరీరం

వణకుతోంది, చేతిలో నుండి గాండీవం జారిపోతుంది, శరీరాన్ని గాని ,మనస్సు గాని నిలుపుకోలేని స్థితిలోకి వచ్చాను. నా వారిని చంపటం వలన వేలేమి జరుగుతుందో ఊహించలేకపోతున్నాను అని చెప్పి అర్జునుడు రథంపై చతికిల పడ్డాడు. అతని మనస్సు దు:ఖంతో నిండింపోయింది ధనుర్బాణాల్ని త్యజించాడు.



## ౨. సాంఖ్య యోగము

మహావీరుడైన అర్జునుడు ఆ విధంగా దయార్థ్రహృదయంతో కన్నీరు కారుస్తూ దు:ఖములో మునిగియుండ శ్రీకృష్ణభగవానుడు చూచి, ఓహో! అర్జునా! ఇటువంటి విషయసమయంలో నీకు యిటువంటి దు:ఖం తగినదేనా? పామరునివలె చింతిస్తూన్నా వెందుకు? దీనివలన నీకు స్వర్గం, కీర్తి దూరమవుతాయికదా! నీవు పిరికివానివలె మాట్లాడుతున్నావు. ధైర్యాన్ని విడిచిపెట్టడం ఎంత నీచం? గుండె నిబ్బరం చేసుకో? యుద్ధానికి నడుం కట్టు అని చెప్పి ప్రోత్సహించాడు. కాని అర్జునుడు దిగులుతో మధుసూధనా! భీష్మ ద్రోణులతో నేను యుద్ధము చేయవచ్చా? వారు నాకు గురువులును పూజనీయులునుకదా! వీరిని ఏవిధంగా చంపగలను. నా మనస్సు దయతో వ్యాకులత పొంది ధర్మాధర్మ విచక్షణ చేయలేని స్థితికి పోయింది. అందుచేత నిన్ను శరణు వేడుకుంటున్నాను .నాకేది శ్రేయాన్ని కలిగిస్తుందో నీవే నిర్ణయించి నన్ను ఆజ్ఞాపించు అని పలికెను. అదిచూచి శ్రీ కృష్ణభగవానుడు

మందహాసంతో అర్జునా ! నీ చర్యచాలా వింతగా వుంది. మహాజ్ఞానుల వలె ధర్మపన్నాలు వల్లిస్తున్నావు. ఏడవకూడని వారి కొరకు ఏడ్చేమూఢునివలె శోకిస్తున్నావు. చనిపోయిన వారిని గురించి గాని, బ్రతికి యున్నవారిని గురించి గాని పండితులెన్నడూ శోకించరు. నేను గాని, నీవు గాని ఈరాజ లోకంగాని ఒకప్పుడు లేకుండా నుండలేదు మరణానంతరము కూడ లేకుండను పోదు.

ఈ దేహమందు దేహియగువాడు బాల్య, యౌవన, కౌమార, వార్ధక్య వ్యవస్థలు పొందే విధంగానే ఈశరీరాన్ని విడిచిన తరువాత మరియొక దేహాన్ని ఆశ్రయించటం జరుగుతుంది. ఇందుకొరకు ధీరుడైనవాడు మోహాన్నిపొందడు (దు:ఖింపడు). శబ్దం, స్పర్శ, రూప, రస, గంధం, అనేవి ఇంద్రియాలతో గూడినవై, చలి వేడి, సుఖం, దు:ఖం మొదలైన అనుభవాల్ని కలిగిస్తుంటాయి. అవి ఎప్పుడూ ఉండేవికావు.

లేని వస్తువుకు ఉనికి లేదు ఉన్నవస్తువు లేకుండనూపోదు, ఆత్మ సత్తనియు, అనాత్మయైన ఈ శరీరం అసత్తనియు తత్త్వవేత్తలు మాత్రవే

గ్రహించగలరు. ఈ ఆత్మ నాశనం కానిది. నిత్యమైనది, అప్రమేయమైనది అయివుండి దేహాన్ని ధరిస్తూ యుంటుంది. ఈ దేహాలు అశాశ్వతాలయినందున నశిస్తూవుంటాయి. అందుచేత యుద్ధానికి సిద్ధపడు. ఈ ఆత్మ చంపునదిగాని, చంపబడునది కాని కాదు. అర్జునా! ఈ ఆత్మ పుట్టదు, చావదు ఒకప్పుడుండి మరొకప్పుడు లేకుండను పోదు. అందుచేత ఇది నిజమును, నిత్యమును, శాశ్వతమును, పురాణమునునైయున్నది. శరీరము చంపబడినంత మాత్రాన అది మాత్రం చంపబడదు.

మనం చినిగిపోయిన పాత వస్త్రాల్ని విడిచి క్రొత్త వాటిని ఏవిధంగా ధరిస్తామో, అదేవిధంగా జీర్ణించిపోయిన ఈదేహాన్ని వదలిపెట్టి ఆత్మ క్రొత్త దేహాల్ని ధరిస్తూ వుంటుంది. ఆత్మను ఆయుధాలు నరుకలేవు, అగ్ని దహింపలేదు, నీరు తడుపలేదు, వాయువు శోషింపచేయలేదు. అది ఇంద్రియాలకు కనిపించదు. దానిని గురించి మనస్సుతో నూహించుటకుగూడ సాధ్యంకాదు. దానికి ఎటువంటి మార్పునులేదు. ఇటువంటి ఆత్మతత్త్వాన్ని గ్రహించి నీశోకాన్ని విడిచిపెట్టు.

పుట్టినవాడు చావక తప్పదు. చచ్చినవాడు తిరిగిపుట్టక తప్పదు. మనుష్యాది సమస్త భూతాలకు తొలుత రూపాలు లేవు. మధ్యలో వానికి రూపం వచ్చింది. తుదకది మృత్యువును పొంది మాయం కాక తప్పదు. అర్జునా! ప్రతి దేహంలోను నివసించే దేహి (ఆత్మ) నిత్యుడును, అవధ్యుడును అయివుండటంవలన ఏజీవి కొరకును దు:ఖించాల్సిన పని లేదు స్వధర్మాన్ని బట్టి గూడా క్షత్రయునకు యుద్ధధర్మంకంటె శ్రేయస్కరమైనది మఱొకటిలేదు. కౌంతేయా! లే! యుద్ధం చేయడానికి నిశ్చయించుకో. చచ్చితివా వీర స్వర్గం పొందుతావు. గెలిచితివా -భూమిని అనుభవిస్తావు. లాభనష్టాలు,జయాపజయాలు, సుఖదు:ఖాలు అనే వాటితో నీకు పనేంటి? ఏదైన ఒకటే అనుకొని యుద్ధానికి సిద్ధపడటంవల్ల నీకెటువంటి పాపాము అంటుకోదు. ఏపని చేసినా ఫలాపేక్ష లేకపోయినట్లయితే దోషమంటదు.

పార్థా! నీ వింతవరకు సాంఖ్యబుద్ధిని గురించి విన్నావు. ఇక యోగబుద్ధిని గురించి చెబుతాను విను. కొందరు అల్పజ్ఞానులు ఇహపరలోక భోగైశ్వర్యాలే జీవిత లక్ష్యంగా భావిస్తూ వేదవాక్యాల రహస్యాలు గ్రహించలేక

శబ్ధార్థాలనే ఆధారంచేసుకొని చిలుక పలుకులు పలుకుతూ స్వర్గ సుఖం కంటె మించిన సుఖం మరొకటి లేదని కామవాసనా ప్రాబల్యంవలన కర్మకాండ ప్రధానులై జనన మరణ ప్రవాహంలో కొట్టుకొని పోతూవుంటారు. అట్టి వారి బుద్ధి భోగవాసనల వల్ల ఆకర్షింపబడి అనేక విధాల పోతుందిగాని, ఏకాగ్రమై సమాధి స్థితియందు నిలుకడచెందదు.

కర్మకాండ ప్రతి పాదకాలైన వేదాలు సత్త్వరజస్తమో గుణాలకు సంభందించిన విషయాలు లక్ష్యంగా కలిగి యున్నాయి. నీవు త్రిగుణాల్ని అతిక్రమించి సుఖదు:ఖ లాభనష్టాది ద్వంద్వాల్ని అతిక్రమించి సత్త్వగుణ సంపన్నుడవై యోగక్షేమాల్ని ఆలోచింపక ఆత్మయందే మనస్సు లగ్నం చేయి. ఇటువంటి జ్ఞానసిద్ధి నీకింకను కలుగలేదు. కాబట్టి నీకు కర్మచేయుటయందే అధికారం కలదు కాని కర్మ ఫలాన్ని ఆశించి నీవేపని చేయకు. ఫలితం ఉన్నాలేకపోయిన సమత్వాన్ని సహించడవే యోగమనిపించుకుంటుంది అందుచేత నీవు నిస్సంగుడవై యోగమందు నిలిచి కర్మల్ని ఆచరించు. ఫలాపేక్షతో కర్మలు చేయటం చాలా

నికృష్టమైనది.

పార్థా! మనసులోని అన్ని కోరికలను వదలిపెట్టి, సహజస్థితియందుండి,ఆత్మానందాన్ని అనుభవించేవాడు స్థితప్రజ్ఞుడనబడుతాడు. దు:ఖాలవలన మనశ్చాంచల్యంపొందక, సుఖాలతో స్పృహవదలక, అనురాగం, భయం, క్రోధం అనేవి లేనివాడే స్థితప్రజ్ఞుడు. వివేకంతో పురుషుడెంత ప్రయత్నించినప్పటికిని ఇంద్రియాలు మనస్సను బలవంతంగా ఆకర్షిస్తాంటాయి. అందుచేత మొట్టమొదట ఇంద్రియాల్ని జయించాలి. విషయాల్ని గురించి ఎప్పుడూ ఆలోచించడం వలన మనస్సు వాటిలో చిక్కుకుంటుంది. అందువలన కోరికపుడుతుంది. కోరిక నేరవేరకపోయినట్లయితే క్రోధం వస్తుంది. క్రోధం వలన కలిగిన ఆవేశంలో తన్ను తాను మరిచిపోయి యుక్తా యుక్త వివేకం నశించి అనరాని మాటల్ని అనటం చేయరాని పనుల్ని చేయటం జరుగుతుంది. వాటి ఫలితంగా మనుజుడు చెడిపోవడం జరుగుతుంది.

కోరికలన్నింటిని విడిచిపెట్టి, యే ఆపేక్షలేకుండ అహంకార మమకారాలు దరిచేరనీయక నడుచుకొనేవాడు పరమ శాంతిని పొందగలడు. దీనినే బ్రహ్మీస్థితి అని అంటారు.



## 3. కర్మ యోగము

ఈ లోకంలో రెండు విధాలుగా నిష్టలు కలవు. అవి మానవుల స్వభావాన్ని అనుసరించి జ్ఞానమార్గమని, కర్మమార్గమని అనుష్టింపబడుచున్నవి. జ్ఞాననిష్టలు సాంఖ్యులని, కర్మ నిష్టులు యోగులని వ్యవహరింపబడుతారు.

అన్నం వల్లనే జీవరాసులు పుడుతున్నాయి. ఆహారం వర్షంవలన లభిస్తుంది, ఈ వర్షాలు యాగాల వలన, యాగాలు కర్మల వలన కలుగుతున్నాయి. ప్రకృతి వల్ల కలిగే గుణాల చేతనే సర్వకర్మలు జరుగుతూయుండగా మూఢులు మాత్రము అహంకారం వల్ల మేమే ఈపనులు చేస్తున్నాము అని అనుకుంటారు. తత్ఫలితముగా జన్మ పరంపరలను దు:ఖమును అనుభవించుచున్నారు. కాబట్టి తాను ఆత్మ స్వరూపుడనని, కర్త కాదు అని తలంచినచో దు:ఖ రహితుడై బ్రహ్మానందము పొందగలడు.

తత్త్వవేత్త ఆత్మనాత్మ వివేకము కలవాడగుటచేత నతడు ఆయా గుణములు, ఆయా కార్యములందు ప్రవర్తించుచున్నాయని ఈ ఆత్మయగు తాను

యేమియు చేయుటలేదు అని నిశ్చయించుకొని కార్యములందు సంగవర్జితుడై యుండును. గుణకర్మల యందు, దృశ్యపదార్థముల యందు అభిమానము, సంగము కలవారిని అల్పజ్ఞులని భగవానుడు పేర్కొనిరి, సమస్త బ్రహ్మాండములకు మూలమైనట్టి బ్రహ్మ(ఆత్మ) వస్తువు నెరింగినచో అంతయు తెలుసు కొనబడిదేయగును.

ఆధ్యాత్మ చిత్తముతో సమస్త కర్మలను భగవదర్పణము (కృష్ణార్పణము) గావించి ఆశ మమకారములను వదిలి స్వకీయ కర్మలను ఆచరించవలెను.

**అర్జునుడు అడిగెను :** కృష్ణా! మనుజుడు పాపము చేయవలెనని కోరనప్పటికి దేని చేత బలాత్కారముగ పాపము చేయుటకు పూనుకొనుచున్నాడు? భగవానుడు చెప్పెను. అది కామము యొక్క ప్రేరణచే, కామము ఎంత అనుభవించినను తృపినొందనిది మహా పాపజనకమైనది. జీవునకు ప్రబల శత్రువు కామము, అనగా ఏవిధముగా పొగ చేత అగ్ని, దుమ్ము చేత అద్దము, మావి చేత గర్భము నందలి శిశువు కప్పబడియున్నవో అదే విధముగా కామము చేత జ్ఞానము కప్పబడి వున్నది.

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి కామమునకు ఆశ్రయము. దేహము రధము వంటిది, అది జడమైనది. ఇంద్రియములు గుఱ్ఱములు వంటివి అవి ఒకింత చైతన్యవంతమైనవి. కావున దేహము కంటే ఇంద్రియములు గొప్పవి. ఇంద్రియముల కంటేమనస్సు, మనస్సు కంటే బుద్ధి, బుద్ధికంటే ఆత్మ గొప్పది. ఆత్మయేతరమగు బుద్ధ్యాదులన్నియూ ప్రకృతికి లోబడి ప్రవర్తించుచున్నవి. అవి దృశ్యములు. ఆత్మ ఒక్కటియే ద్రృక్కు. కావున ఆత్మను చేరి అచటనే నివాసము ఏర్పరచుకున్న ఈసంసారబంధ విచ్ఛేదనము సంభవించగలదు. కాబట్టి మోక్షమును కాంక్షించువారు తాము దేహము కాదు అని, అన్నిటికి సాక్షియగు ఆత్మయని తలంచి ధృఢ నిశ్చయము కలిగియున్నచో ఇంద్రియములు అదుపులో నుండును

కర్మచేయక ఎవడును ఒక్క క్షణము కూడ నుండలేడు. ఎందుచేతనంటే శ్వాస (పీల్చేగాలి) గూడా కర్మయనబడుతున్నది. కర్మలాచరించు చున్నప్పటికి వాటితో బంధిపబడుకుండ యుండటము నైష్కర్మ సిద్ధి అవుతుంది.

అర్జునా! నీకు విధించబడిన పనిని సరిగా చేయి.

ఏ పని చేయకుండా వుండడం కంటే ఏదో ఒకపని చేస్తూవుండడం మంచిది. ఫలాపేక్ష లేకుండా చేసిన బంధాన్ని కలిగించదు.

జ్ఞాని కర్మ చేసినా చేయకపోయినా అతని ఆత్మానందానికి ఆటంకం లేదు. కాబట్టి ప్రతి ఫలాపేక్ష లేకుండా నీకు నియమించబడిన పనిని సదా చేస్తూయుండు. ఫలాపేక్ష లేనివాడు పనులు చేస్తున్నప్పటికిని మోక్షాన్ని పొందగలడు.



# 4. జ్ఞానయోగము

**అర్జునుడు అడిగెను :-** కృష్ణా ! నిష్కామ కర్మయోగమెట్టిది? అది లోకమున కెట్లు వ్యాపించెను? అర్జునా! అది నాశరహితమైనది. శాశ్వత మోక్ష ఫలంబొసగునది. ఈ నిష్కామ కర్మ యోగము మొదట నాచే సూర్యునికి ఉపదేసింప, సూర్యుడు మనువునకు, మనువు విక్ష్వాకునకను దానిని భోదింప క్రమముగా లోకమున వ్యాపించెను.

**అర్జునుడు అడిగెను :-** శ్రీ కృష్ణా ! మీజన్మము ఇటీవలది. సూర్యుని జన్మము బహు పురాతనమైనది. అట్టిచో మీరు సూర్యునకు ఉపదేశించిరన్న విషయము నే నెట్లు గ్రహించగలను?

**కృష్ణుడు చెప్పెను :-** అర్జునా! నీకును, నాకును ఇంతవరకు అనేక జన్మలు గడిచినవి. వాటినన్నిటిని నేనెఱుంగుదును. కానీ నీ వెరుగువు.

**అర్జునుడు అడిగెను :-** కృష్ణా! భగవంతుడు ఎట్టివాడు?

**కృష్ణ భగవానుడు చెప్పెను :-** అర్జునా! భగవంతుడు జన్మ రహితుడు నాశవర్జితుడు, జగన్నియామకుడు, ప్రకృతిని స్వాధీనపరుచుకొని లోకోర్ధారణము కొరకు

మాత్రము జన్మించుచున్నాడు కాని, అజ్ఞానుల వలె కర్మకు వశుడై కాదు. ధర్మము క్షీణించినపుడు, అధర్మము వృద్ధినొందినప్పడు సాధుసజ్జనులను సంరక్షించుట కొరకు, దుర్మార్గులను వినాశనమొనర్చుటకు, ధర్మము స్థాపించుట కొరకు ప్రతి యుగమున అవతరించుచుండును. నా యొక్క పుట్టుక అంటే ఏమిటో నిజాన్ని తెలుకున్నవాడు చనిపోయిన తరువాత మరలా పుట్టకుండ శాశ్వతమైన మోక్షాన్ని పొందుతాడు. సత్వ రజస్తమో గుణాల భేదాన్ని బట్టి వారు చేసే పనిని బట్టి నా చేతనే నాలుగు రకాల కులాలు ఏర్పాటు చేయబడ్డాయి. అర్పణమును, హవిస్సును హోమాగ్నియును, హోమం చేయువాడును బ్రహ్మేమేయని తెలుసుకున్నవాడు బ్రహ్మకర్మ అనే సమాధి చేత ఆ బ్రహ్మన్నే పొందుతాడు. మండుతువున్న అగ్ని కట్టెలను ఏవిధంగా బూడిద చేస్తుందో అదే విధముగా జ్ఞానము అనే అగ్ని సమస్త కర్మలనే కట్టెల్ని భస్మం చేస్తుంది.

జ్ఞానము మీద ఆసక్తి వుండి, ఇంద్రియాలను జయించి ఎవడు శ్రద్ధ గలవాడై యుంటాడో వాడే

జ్ఞానాన్ని పొంది త్వరలో విముక్తి పొందగలడు. జ్ఞానాపేక్ష లేకుండా, శ్రద్ధ లేకుండా సందేహాలతో వుండేవానికి ఈలోకంలో కాని పరలోకంలోకాని సుఖం వుండదు. అందుచేత అజ్ఞానముతో పుట్టిన సందేహాల్ని జ్ఞానము అనే కత్తితో తెగటార్చి బుద్ధియోగన్ని అవలంబించి యుద్ధానికి సిద్ధపడు అన్నాడు. శ్రీ కృష్ణ పరమాత్మ.



# 5. కర్మసన్యాస యోగము

**అర్జునుడు పలికెను :-** కృష్ణా ! నీవు ఒకప్పుడు కర్మ సన్యాసము గొప్పదిని మరొక్కప్పుడు బుద్ధియోగము గొప్పదని సమర్ధిస్తున్నావు. ఈ రెండింటిలో ఏది ఉత్కృష్టమో నిర్ణయించి చెప్పము అని అడిగెను.

**శ్రీ కృష్ణ భగవానుడు పలికెను :-** అర్జునా ! కర్మసన్యాసము కర్మ యోగము రెండునూ మోక్షాన్నిచ్చేవి. కాని కర్మ సన్యాసము కంటే కర్మ యోగము అనబడే బుద్ధియోగమే గొప్పది. కర్మ యోగము బుద్ధియోగము రెండునూ ఒకే మోక్ష ఫలమును కలుగజేయును. జీవుడు ఆత్మయైనందున తన ఇచ్చానుసారముగ దేనినైనను కోరుకొనే శక్తి కలిగియిండును. కనుక జీవుడు తన కోర్కెల విషయమున మోహము నొందినపుడు భగవానుడు వాటిని నెరవేర్చుకొను అవకాశము జీవులకు కల్పించును. జీవుల కర్మలకు, కర్మఫలములకు భగవానుడు జీవుని సహచర్యమున నుండి వారి కోర్కెలనన్నిటిని అవగాహన చేసుకొనుచు వారి అర్హతను బట్టి వారి కోర్కెలను పూర్ణము గావించుచుండును.

ఒక శరీరమున కన్ను , ముక్కు, చెవి మున్నగు వేరు వేరు అవయువయులన్నింటియందును మనుజునకు సమానమైన ప్రేమ, ఆశక్తి ఎట్లు కలదో అట్లే విశ్వమంతయు ఒకే ఆత్మ యొక్క శరీరమని భావించి సర్వజీవుల యెడల సమభావము కలిగి వర్తించువాడే జ్ఞాని.

తాను శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి కాదు అనియు వాటి అన్నిటికి సాక్షిగా యుండు ఆత్మయని తెలుసుకొని అట్టి సాక్షి స్థితియందు నిలుకడ కలిగియుండి తాను నశించువాడు కాదని, నశించునది పంచభూతాత్మకమగు దేహమేయని చింతన చేయువాడిని తత్త్వజ్ఞాని అని చెప్పదురు.

దేహములనునవి ప్రకృతి జన్య త్రిగుణముల ద్వారా రూపొందిన వైనను దేహము నందుండెడి ఆత్మ, పరమాత్మ మాత్రము ఒకే ఆధ్యాత్మికత కలిగియుండును. ఎవడైతే తాను చేసే కర్మలని పరమాత్మ కర్పించి ఫలాపేక్ష లేకుండా చేస్తాడో అటువంటి వాడు నీటిలోని తామరాకువలె పాపాలను పొందడు.

ఆత్మజ్ఞానము వల్ల ఎవ్వరి అజ్ఞానము నశిస్తుందో

వానికి సూర్యుని వలె జ్ఞానము పరమార్థాన్ని ప్రకాశింపజేస్తుంది. అర్జునా! విషయేంద్రియాల వల్ల కలిగే భోగాల ఆద్యంతాలు వస్తూపోతూవుంటాయి. కాబట్టి జ్ఞాని విషయభోగాల మీద ఆశక్తి చూపడు, నేనే అన్ని యజ్ఞాలను తపస్సులను అనుభవించే భోక్తనని అన్ని లోకాలకు ఈశ్వరుడనని ప్రాణులకు ఉపకారినని ఎవడు తెలుసుకుంటాడో వాడే శాంతిని పొందగలడు.



## 6. ఆత్మసంయమ యోగము

శ్రీ కృష్ణభగవానుడు తన దివ్యశక్తులచే సర్వత్ర వ్యాపించి యుండును. సర్వజీవుల హృదయస్తుడైన దేవ దేవుడగు శ్రీ కృష్ణుని తెలుసుకొనుట ద్వారానే జన్మ మృత్యువులను అధిగమించవచ్చును.

ఎవడు చేయవలసిన కర్మలను ఫలాపేక్ష లేకుండ చేయునో అతడే సన్యాసి, యోగియును అవుతాడు కాని, తనకు నియమింపబడిన అగ్నిహోత్రాది కర్మల్ని విడిచి, విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చని వాడు సన్యాసియు, యోగియును కాడు. సన్యాసమని చెప్పబడేదే యోగమని గ్రహించు, ఎందుకంటె సంకల్పాలు విడిచిపెట్టకుండ ఎవ్వడును యోగి కాలేడు.

మనస్సు, ఇంద్రియములు వశమందున్నచో అవియే బంధువులు, లేనిచో అవియే శత్రువులు, యోగసిద్ధి కోరుకునే యోగి నిర్మలమైన చోట ఇంద్రియ మనోవృత్తులను నిగ్రహించుకొని, మనస్సును ఏకాగ్రమొనర్చుకొని భగవంతుని యందు చిత్తము నిల్పినవాడై యుక్తుడై ఆత్మశుద్ధికొరకు యోగాన్ని అభ్యసించాలి. మితాహారం, మితనిద్ర, మితసంచారం

మెలకువ కలిగి యుక్తమైన కర్మలలో నడుచుకునే వానికి మాత్రమే దు:ఖాన్ని దూరంచేసే ఈ యోగం సిద్ధిస్తుంది.

యేగంతో కూడిన మనస్సు కలవాడు అన్ని ప్రాణులయందు సమభావంతో తనలో అన్నిప్రాణుల్ని , అన్ని ప్రాణులలో తనని చూచుకోగలడు. యోగంలో మనస్సు స్థిరంగా నిలుపుకోవటము కష్టవేం అయినప్పటికి దానిని అభ్యాసంచేతను , వైరాగ్యం చేతను నిగ్రహించుకోవచ్చును. అభ్యాసం చేస్తూనే యోగం పూర్తి కాకముందే చనిపోయినవారు పుణ్యకర్మలు చేసేవారు పొందే లోకాలను పొంది అక్కడ చాలా కాలం వుండి తరువాత సదాచారవంతులైన శ్రీ మంతులు ఇండ్లలో లేదా బుద్ధిశాలురైన యోగుల ఇండ్లలో జన్మిస్తూ యుంటారు. అట్లు జన్మించిన యోగి ఎట్టి ప్రయత్నాలు చేయకపోయినను పూర్వ జన్మలో చేసిన అభ్యాస బలం వల్ల అట్టి యోగం పట్ల ఆకర్షితుడై కొన్ని జన్మల తరువాత యోగ సిద్ధిని పొంది సర్వోత్తమమైన మోక్షాన్ని పొందుతాడు.

యోగులందరిలోను ఎవడు నాయందు (ఆత్మయందు) మనసు నిలిపి శ్రద్ధతో ధ్యానించు-చున్నాడో అట్టివాడు సర్వశ్రేష్టుడు.

# 7. విజ్ఞాన యోగము

జ్ఞానమనగా తెలిసికొనుట, విజ్ఞానమనగా అనుభవ పూర్వకమైన జ్ఞానము. ప్రంపచములో ఎన్ని విద్యలున్నప్పటికిని భగవంతుని గూర్చిన జ్ఞానము అనుభవ పూర్వకముగ తెలిసికొనినచో సమస్తము తెలిసికొన్నట్లేయగును.

భౌతిక జగత్తు సృష్టికై శ్రీ కృష్ణ భగవానుని సంపూర్ణ స్వాంశ మూడు విశ్వరూపములను దాల్చును, అందులో మొదటిది మహావిష్ణువు యొుక్క మహత్తత్త్వము. అది భౌతిక శక్తిని సృష్టించును. రెండవ విష్ణురూపమైన గర్భోదకశాయి విష్ణువు వివిధ వ్యక్తీకరణలకై అన్ని విశ్వములందును ప్రవేశించును. ఇక మూడవ విశ్వరూపమైన క్షీరోదకశాయి విష్ణువు సకల విశ్వములందు పరమాత్మ రూపమున వ్యాపించి పరమాత్మగా పిలువబడుచు అణువణునందును నిలిచి యుండును. ఈమూడు విశ్వరూపములను గూర్చి తెలుసుకున్నవాడు భవబంధముల నుండి ముక్తి పొందగలడు.

భౌతిక శక్తియందు ముఖ్యముగా ఎనిమిది

అంశములు గలవు. వీనిలో భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనునని ఐదు పంచ భూతములు, వీనియందే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము అను ఐదు ఇంద్రియార్థములు యిమిడి యున్నవి. కాని మనస్సు, బుద్ధి, అహంకారము అను మిగతా మూడు విషయములు భౌతికవాదులచే ఉపేక్షింపబడును. భౌతికపదార్థమునందు ఆత్మ నిలుచుట చేతనే స్థూల దేహము వృద్ధినొందును. అదే విధముగా పరమాత్మయైన విష్ణువు యొక్క ఉనికి వలననే బ్రహ్మాండమైన విశ్వము వృద్ధి నొందినది. కనుకనే ఆత్మ భౌతిక పదార్థము అనునవి శ్రీ కృష్ణ భగవానుని శక్తులుగా తెలియబడుచున్నవి

పక్షులు, జంతువులు, మనషులు, పలు ఇతర జీవులు జంగములు కాగా వృక్షాదులు స్థావరములు. సత్త్వరజస్తమో గుణములు శ్రీ కృష్ణ భగవానుని నుండియే ఉద్భవించిను అతడెన్నడూ వాటిచేత ప్రభావితుడు కాడు. కనుకనే అతడు నిర్గుణడు అనగా గుణములు అతని నుండియే కలుగుచున్ననూ అతని పై ప్రభావము చూపలేవు. అదే భగవానుని యొక్క ప్రత్యేకత. దైవీ సంబంధమయిన ఈ మాయను

దాటేందుకు ఎవ్వరికిని శక్యము కాదు. కాని నన్ను శరణుబొందినవారు మాత్రవే ఈ మాయను దాటగలరని శ్రీ కృష్ణ భగవానుడు ప్రకటించెను. బ్రహ్మ, రుద్రాదులు ఉన్నతులు మరియు దాదాపు విష్ణువు స్థాయికి చెందిన వారే యైనను మాయా బంధము నుండి జీవునికి ముక్తి మాత్రము కలిగించలేరు. బ్రహ్మ, రుద్రాదులు సైతము మాయా ప్రభావమునకు లోబడి యుండువారే. కేవలము విష్ణువే మాయకు ప్రభువు కావున అతడే బద్ధ జీవుని బంధము నుండి విడిపించగలడు. శ్రీ కృష్ణ భగవానుని అవగాహన చేసి కొనుట ద్వారానే ముక్తి లభించగలదు.

ఆపదలో పడినవారు ( ఆర్తులు) ఈ ప్రకృతి కారణవస్తు వేదైయుండునో దానిని తెలుసుకోవాలనే వారు (జిజ్ఞాసులు) ధనాన్ని కోరేవారు (అర్థార్థులు) నా దేహాన్ని నియమించువాడే ఈ జగత్తును నియమించువాడని గ్రహించినవారు (జ్ఞానులు) అనే నాలుగు రకాల వారు నన్ను సేవిస్తూవుంటారు. పై నలుగురు గొప్పవాళ్ళే. కాని జ్ఞాని యన్నచో నేనే నని నా అభిప్రాయము. ఇచ్ఛ, ద్వేషం అనే వాని వల్ల కలిగే

అజ్ఞానాత్మకమైన ద్వంద భావము వల్ల అన్ని భూతాలు పుట్టుకలోనే మోహాన్ని పొందుతున్నాయి.

తల్లి గర్భమున నున్నపుడు జీవునకు దాదాపు 7వ మాసమున క్షణ కాలము దివ్య దృష్టి కలుగగా అపుడాతడు తన పూర్వపు జన్మల నన్నింటిని చూచి భీతిల్లి భగవానుని శరణు బొంది జన్మరాహిత్యమునకై ఈ జన్మమున సర్వప్రయత్నములు చేయుదు నని వాగ్దానము చేయును. కాని శిశువు గర్భము నుండి భూమిపై పడగానే మాయ ఆవరించి సర్వము మరచిపోయి మాయలో చిక్కుబడును. ఈమె నా భార్య, ఇది నా ఇల్లు, నేను ఈఇంటి యజమానిని, నేనీమెకు భర్తను అని భాంచుచు, మానావ మానములు సుఖ దుఃఖ ములు, శుభము అశుభము అనే ద్వందములలో మునిగియుండి మోహితులగు వారు మూఢులనబడుదురు. తాత్కారణముగా వారు శ్రీ కృష్ణ భగవానుని అవగతము చేసికొనజాలరు.

పాపాలను చేసేవారు విచక్షంగా జ్ఞానం లేని బుద్ధిహీనులైన నీచ మానవులును నామాయవలన ఈ మూడు గుణాలతో (సత్త్వరజస్తమో) ఆకర్షింపబడి ధనం, హోదా, పదవులు మొదలైన వాటిని ఆశించి,

అజ్ఞానంలో పడి రాక్షస స్వభావము గలవారై నన్ను శరణుబొందరు. అనేక జన్మలలో చేసిన సాధనా ఫలితంగా ఒకానొకడు మాత్రమే నన్ను తెలిసికొన గల్గుతున్నాడు. అటువంటి మహాత్ములు బహుదుర్లభులు.

ప్రకృతి భోగాలే సుఖశాంతులిస్తాయనే అజ్ఞానంలో పడిన ప్రజలు వారి వారి కోర్కెలను తీర్చుకోవటానికి ఆయా దేవతలను ఆశ్రయించి భజింపగోరుకుంటూ యుంటారు. అట్లువారా దేవతలను పూజించుటకు తగిన శ్రద్ధను యిచ్చేదిగూడా నేనే, నేనిచ్చిన శ్రద్ధతో వారు పూజించిన దేవతల నుండి కోరుకునే ఫలితాల నిస్తూయుంటాను. అల్పబుద్ధి గల దేవతోపాసకులు దేవతలనే చేరుకుంటున్నారు. వారిచ్చే ఫలితాలు నశించేవే కాని శాశ్వతమైన మోక్షం కాదు. నా భక్తులు మాత్రమే నన్ను చేరుకోగలరు. అదియే నాశనం లేని మోక్షం. ఇంతకు ముందెన్ని భూతలు గతించాయో, ఇప్పడెన్నియున్నాయో, ఇక ముందెన్ని పుడతాయో అవన్నియూ నాకు తెలుసు. నన్ను మాత్రం ఎవ్వడూ తెలుసుకొనలేడు. అపరా ప్రకృతి పరాప్రకృతి అనురెండు ప్రకృతులు గలవు. ఈ రెండు ప్రకృతులు భగవానుని

ఆధీనంలో యుండును

**అపరాపకృతి:-** పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము అని ఈ ఎనిమిది అపరా ప్రకృతి యనబడును.

**పరా ప్రకృతి :-** ఏది జీవరూపమ్మైయున్నదో దేనిచేత ఈ జగత్తంతయు ధరింపబడియున్నదో అదియే పరా ప్రకృతి. ఈ సమస్త ప్రాణి కోట్లు పరాప్రకృతి వలననే ఏర్పడినవి. ప్రతి మనుజుడు మొట్టమొదట తాను మాయారూప బంధమున తగుల్కొని యున్నాడను సత్యమును గ్రహించుట అత్యావశ్యము. భగవంతుడు త్రిగుణాత్మకములగు సత్త్వరజస్తమో గుణముల కవతల యున్నాడు. ఈ మాయను దాటినచో భగవద్దర్శనము కలుగును. ఎవరు భగవంతుని శరణుబొందుదురో వారే ఈ మాయను దాటగలరు. అధిభూత, అధిదైవ, అధి యజ్ఞలతో గూడిన వాడనైన నన్ను తెలిసికున్నవారు యోగ బుద్ధి వల్ల మరణకాలంలో నన్ను తెలిసికోగలరు.



## 8. అక్షర పరబ్రహ్మయోగము

**శ్రీ కృష్ణ పరమాత్మ చెప్పినది విన్న అర్జునుడు :-** కృష్ణా! పరబ్రహ్మ, ఆధ్యాత్మము, కర్మ అధిభూతము, అధి దైవము అని చెప్పావు. అవి ఏవి ? అధియజ్ఞుడనువాడీ దేహమున ఎట్లుండును? దయతో నాకు వివరింపుము అనగా భగవానుడు పలికెను. అర్జునా! బ్రహ్మము నాశరహితము, శాశ్వతమును అయియున్నది. బ్రహ్మము జీవుని సూచించగా, పరబ్రహ్మము దేవ దేవుడైన శ్రీ కృష్ణ భగవానుని సూచించును. తన స్వభావమే ఆధ్యాత్మము. భూత సృష్టికి కారణమైన దేవతోద్దిష్టమైన హోమ ద్రవ్యముల యొక్క విసర్జనమే " కర్మ" యనబడును. మార్పులు చెందే స్వభావము గల దానిని " అధిభూతము అంటారు." ఈ దేహములో నున్న పురుషుడినే " అధిదైవ"మంటారు. ఈ దేహంలో నున్న నేను " అధియజ్ఞుడు " అనబడును".

జీవుడు భౌతిక ప్రకృతిలోని యెనుబది నాలుగు లక్షల జీవరాసులలోని ఏదైన ఒక దేహముతో జన్మను పొందినను ఆధ్యాత్మిక జగత్తున మాత్రము ఒకే దివ్య దేహమును కలిగియుండును. యజ్ఞ

విధానములందు జీవుడు ప్రత్యేకమైన స్వర్గలోకములను పొందుటకు, ప్రత్యేకమైన యజ్ఞములను ఆచరించి, తత్ఫలితముగా వాటిని పొందుచుండును. కాని యజ్ఞఫలము నశించినంతనే భూమికి వర్షరూపమున అరుదెంచును. తదుపరి వర్షరూపము నుండి ధాన్యరూపమును పొందును. ధాన్యము మనజులచే భుజింపబడగా వీర్య రూపమును పొంది స్త్రీ గర్భమున చేరి తిరిగి మానవ దేహమును పొందును. మరల మానవ జన్మలో యజ్ఞములు చేయుచూ ఈ సంసార చక్రమును కొనసాగించు చుండును ఈ విధముగా జీవుడు భౌతిక మార్గమునందే నిరంతరము రాకపోకలు సల్పుచుండును.

**అధిభూతము :-** భౌతిక ప్రకృతి నిరంతర పరిణామ శీలమై యుండును. పుట్టుట, పెరుగుట, కొంతకాలము నిలిచి యుండుట, ఇతర దేహములను ఉత్పత్తి చేయుట, శిథిలమగుట చివరకు నశించుట అను ఆరు విధములైన మార్పులకు భౌతిక దేహములు లోనగుచుండును అట్టి ఈ భౌతికప్రకృతియే “ అధిభూతము“ అనబడును.

సమస్త దేవతలను ,సమస్త లోకములను తనయందు కలిగియున్న శ్రీ కృష్ణ భగవానుని విశ్వరూపవే " అధిదైవతము" అనబడును. దేహమునందు ఆత్మతో పాటు సాక్షిగా నిలిచియున్న పరమాత్మయే" అధియజ్ఞుడు " అనబడును.

ఆత్మ చెంతనే నిలిచియుండెడి ఆ పరమాత్మ జీవికర్మలకు సాక్షిగా నుండి అతని వివిధ స్వభావములకు అనుగుణముగా వర్తించుటకు అవకాశమొసగు చుండును. వెంట్రుక కొనలో పదివేల వంతు పరిణామముగలిగి యుండెడి ఆత్మ యందు ప్రవేశింపగలిగినంత సూక్ష్మమైన వాడు గనుకనే భగవంతుని సూక్ష్మమైన వాటిలో కెల్ల అతి సూక్ష్మమైనవాడని పిలువబడినాడు.

ఈ అనిత్యజగము జన్మము, ముసలి తనము, వ్యాధి మరణములనెడి దు:ఖములచే నిండియున్నది. పూర్ణత్వమును పొంది కృష్ణలోకమైన (దివ్యలోకము) గోలోక బృందావనమును పొందిన మహత్ముడు తిరిగి ఈ లోకమునకు రాగోరడు. దేవతా లోకములైన ఉన్నతలోకములను (బ్రహ్మలోకమ, ఇంద్రలోకము, చంద్రలోకము) పొందిన వారు సైతము వారి పుణ్యము

క్షీణించగానే భూలోకమునకు పతనము చెందు-
చుందురు.

భౌతిక జగత్తు యొక్క కాలపరిణామము పరిమితమై " కల్పము " గా తెలియబడుచుండును. అట్టి కల్పము బ్రహ్మదేవునికి ఒక పగటి సమయము. బ్రహ్మదేవుని ఆ ఒక్క పగటి సమయమున సత్య, త్రేతా, ద్వాపర, కలియుగములు వేయి మార్లు మారు చుండును, ఈ యుగపు (కలియుగము) కాల-పరిమితి 4,32,000 ల. సంవత్సరములు. ఈ యుగము ప్రారంభమయి ఇప్పటికి దాదాపు 5000 సం॥లు గా మన అనుభవముననున్నది. ఈ యుగము నందు దుర్గణము, పాపము విపరీతముగా ప్రబలి పోవును గనుక యుగాంతమున శ్రీ కృష్ణ భగవానుడు దానవులను నిర్జించి భక్తుల రక్షించుట కొరకు " కల్కి" అవతారమున ప్రకటితమగును.

43, 20,000 సం॥లు ఒక మహాయుగము. 1000 మహాయుగములు బ్రహ్మదేవునికి ఒక పగలు ,అట్లే 1000 మహాయుగములు బ్రహ్మదేవునికి ఒక రాత్రి. అనగా 2000 ల మహాయుగములు బ్రహ్మదేవునికి ఒక రోజు. బ్రహ్మా దేవుడు " శత

సంవత్సరముల కాలము జీవించి తదుపరి తన దేహమును త్యజించును.

యోగులైన వారు ఏ కాలములో మరణిస్తే పునర్జన్మను పొందరో ,ఏ కాలంలో మరణి స్తే తిరిగి పుడుతారో దానిని చెప్తాను విను, అగ్ని , ప్రకాశము, పగలు , శుక్ల పక్షము, ఉత్తరాయణము నందు మరణించిన వారు నిరాకార బ్రహ్మాజ్యోతిని పొందుదురు. మరణ సమయమున మనస్సు జీవునికి వేరొక జన్మను పొందునట్లు చేయును. కాని కృష్ణ భక్తి భావనయుతడైన భక్తుడు శుభాశుభయములందు దేహమును విడిచినను (మరణించినను) తిరిగి జన్మించుట అనెడి భయము ఏమాత్రము యుండదు.

భౌతిక జగమును వీడునపుడు ఆత్మ అనుసరించెడి వివిధ మార్గముల యెడ కలత నొందవద్దని శ్రీ కృష్ణ భగవానుడు అర్జున కుపదేశించియున్నాడు.

పొగ, రాత్రి, కృష్ణ పక్షము, దక్షిణాయణము నందు దేహమును వీడిన జనులు మరల తిరిగి జన్మించుచున్నారు గోలోక బృందావనముగా తెలియబడు శ్రీ కృష్ణ ధామము చింతామణి భరితమైన సౌధములతో అలరారుచుండును, కోరిన ఎట్టి

లక్ష్యమైననూ సమకూర్చు కల్పవృక్షములను మరియు అక్షయముగా పాలనొసగు సురభి నామ గోవులను కలిగియుండెడి ఆ ధామమున శ్రీ కృష్ణుడు లక్షల కొలది లక్ష్ములచే సేవింపబడుచుండును. ఆది దేవుడు, సర్వకారణకారణుడునగు గోవిందునిగా అచట అతడు పిలవబడును. మధురముగా వేణు నూదు అతని దివ్యరూపము సర్వజగన్మోహనమైయుండును. దానిని పొందినవాడు ఈ భౌతిక జగత్తునకు తిరిగి రాడు. ఇదంతా తెలుసుకున్న యోగి వేదాలకును, యజ్ఞాలకును, తపస్సులకును, దానములకును ఎటువంటి పుణ్యఫలం విధించబడియుందో దానినంతను మించిన ఫలితమును పొందినవాడై ఉత్కృష్టమైన పరమపదాన్ని పొందుతాడు.



## 9. రాజ విద్యారాజగుహ్య యోగము

రాజవిద్యయనగా విద్యలలో కెల్ల అతి శ్రేష్టమైన దనియు రాజగుహ్యమనగా రహస్యములలో కెల్ల పరమ రహస్యమైనదనియు అర్ధము. దేనిని తెలిసికొనినచో అశుభరూపమగు ఈ సంసార బంధముల నుండి విడివడుదువో అట్టి అతి రహస్యమైన ఈ బ్రహ్మాజ్ఞానము నీకు చెప్పచున్నాను. విను..

ఆత్మలేని దేహము నిరుపయోగము, విలువ రహితము కాగలదు. అయినను జనులు ముఖ్యమైన ఆత్మను గూర్చి పట్టించుకొనక. దేహ అసరములకే ఎక్కువ ప్రాముఖ్యము నొసగుచున్నారు. ఆత్మ దేహము కన్నను అన్యమైనదని, నిర్వికల్పము, నాశరహితము, శాశ్వతమని తెలుసుకొనగల్గుటయే జ్ఞానము నందలి ముఖ్యభాగము. ఆత్మదేహమునందున్నపుడు ఎలా చైతన్యపూర్ణమై యుండునో అట్లే దేహమునుండి ముక్తి పొందిన పిదపయు చైతన్యపూర్ణముగనే యుండును.

పద్మపురాణమునందు మనుజుల పాపకర్మలు విశ్లేషించబడియున్నవి. కామ్యకర్మరతులైనవారు ఆ పాప కర్మల ఫలితమును వివిధ దశలలో వివిధ

రూపములలో అనుభవింతురు. అట్టివారు పాపకర్మలను విడిచినప్పటకి ముందు చేసిన కర్మల ఫలితము అనుభవించక తప్పదు. అందుచే వారు దు:ఖములను, బాధలను అనుభవించుచుందురు ఒక జీవికి మరణము సంభవించవలెననిన భగవానుడు ముందుగానే ఆ జీవికి తదుపరి జన్మము నిర్ణయించి యుందురు.

వృక్షమునకు నీరు పోయుట ద్వారా కొమ్మలు, రెమ్మలు, పత్రములను సంతృప్తిపరచినట్లు, ఉదరమునకు ఆహారవెుసగుట ద్వారా అన్ని ఇంద్రియములను సంతృప్తి పరచినట్లు, శ్రీ కృష్ణ భగవానుని దివ్యసేవయందు నిలుచుట ద్వారా సర్వదేవతలను సంతృప్తిపరిచినట్లేయగును.

ఓ కౌంతేయా ! కల్పాంతమున సమస్త భౌతిక సృష్టులు నాప్రకృతి యందు ప్రవేశించును. తదుపరి కల్పారంభమున నేనే నా శక్తిచే వాటిని తిరిగి సృజింతును.

ఈ భౌతిక ప్రకృతి యొుక్క సృష్టి, స్థితి, లయములు సంపూర్ణముగా శ్రీ కృష్ణ భగవానుని దివ్యసంకల్పము పైననే ఆధారపడియుండును. ఇచ్చట

కల్పాంతమనగా బ్రహ్మదేవుని నిర్యాణము పిదపయని భావము. నూరు సంవత్సరములు జీవించు ఆ బ్రహ్మ దేవునికి ఒక పగలు 432,00,00,000 భూలోక సంవత్సరములతో సమానము.

| | | |
|---|---|---|
| కలియుగము | - | 4,32,000 సం॥లు |
| ద్వాపరయుగము | - | 8,64,000 సం॥లు |
| త్రేతాయుగము | - | 12,98,000 సం॥లు |
| కృతయుగము | - | 17,28,000 సం॥లు |
| ఒక మహా యుగము | - | 43,20, 000 సం॥లు |

1000 మహాయుగములు బ్రహ్మదేవునికి ఒక పగలు. అట్లే 1000 మహాయుగములు బ్రహ్మదేవునికి ఒక రాత్రి. అటువంటి 100 సంవత్సరములు గడిచిన పిదప బ్రహ్మదేవుడు తన తనువు చాలించినపుడు ప్రళయము సంభవించును అట్టి సమయమున అంతవరకు ప్రదర్శితమైన శ్రీ కృష్ణ భగవానుని శక్తి అతనియందే తిరిగి లయించి పోవును. ఇక జీవులకు సంబంధించినంత వరకు కల్పారంభమున వారందరు భౌతిక ప్రకృతి గర్భమునందుంచబడగా, వారి వారి కర్మ ఫలముల ననుసరించి వివిధ స్థానములను

పొందుదురు. ఆ విధముగా భౌతిక జగత్తు యొక్క కార్యకలాపములు ప్రారంభమగును. కాల క్రమమున వృద్ధినొందుట లేదా పరిణామము చెందుటన్నది జరుగక, జగము యొక్క సృష్టితో బాటే వివిధ జీవులు సృష్టింపబడుదురు. అనగా మనుష్యులు , జంతువులు, మృగములు, పక్షులు మొదలగునవన్నియును ఏక కాలమున సృష్టింపబడినవే. గడచిన కల్పాంతమున జీవులు ఏ కోరికలను కలిగియుందురో తద్రీతిగా వారు తిరిగి సృష్టింపబడుదురు. అనగా గడచిన కల్పమునందలి గడచిన జన్మయొక్క స్వభావము ననుసరించి జీవులు తిరిగి సృష్టింపబడుచుందురు. ఇది అంతయు భగవత్సంకల్పము చేతనే జరుగుచుండును. ఇదియే శ్రీ కృష్ణ భగవానుని దివ్యమైన అచింత్యశక్తి.

సంతానము కొరకై తండ్రి తల్లి గర్భమునందు బీజ ప్రదానము చేయునట్లు భగవానుడు కేవలము తన చూపుద్వారానే జీవులను ప్రకృతి గర్భములో బీజరూపమున ఉంచగా వారు తమ పూర్వపు కోరికలు, కర్మల ననుసరించి వివిధ రూపములలో వివిధ జాతులలో జన్మింతురు. జీవులందురు శ్రీ కృష్ణ

భగవానును వీక్షణము చేతనే జన్మించినను తమ కర్మానుసారము వారి కోరికల ననుసరించి వివిధ దేహములను పొందుదురు. అనగా ఆ భగవానునికి ఈ భౌతిక సృష్టితో ఎట్టి ప్రత్యక్ష సంబంధము లేదు.

దేవదేవుడైన శ్రీ కృష్ణ భగవానుని శరణు పొందిన మహాత్ముడు శ్రీఘ్రమే భౌతిక ప్రకృతి యొక్క ఆధీనము నుండి ముక్తి పొందగలడు. అట్టి మహాత్ముడు శ్రవణ, కీర్తనములతో కూడిన భక్తియుత సేవయందు సదా నిమగ్నుడై శ్రీ కృష్ణుని సేవలో నిలుచును గాని, దేవతలు లేదా మనుష్యుల సేవలో కాదు. ఆ రీతిని దేవ దేవుని సదా స్మరించుటయే భక్తి యనబడును. జగన్నియామకుడైన శ్రీ కృష్ణ భగవానుని సేవింపక అన్య దేవతలను సేవించుట గూడా ఆజ్ఞానమనే చెప్పబడును. ఇతర భావాలు లేకుండగ నన్ను స్మరిస్తూ, భజిస్తూ ఎల్లవేళల నా యందే మనస్సు నిలిపిన వారి యొక్క యోగ క్షేమములు నేనే వహింతును. (యోగమనగా- లేనివి సమకూర్చుట, క్షేమము అనగా ఉన్నవి సంరక్షించుట)

నీ మనస్సు సదా నాచింతనయందే నిమగ్నము

చేయుము. నా భక్తుడవగుము. నాకు నమస్కారము చేయుము. నన్ను అర్చింపుము. ఈ విధముగా నా యందు సంపూర్ణ మనస్సుతో నిమగ్నుడవైతవేని నీవు నన్ను తప్పక చేరగలవు.

అర్జునా! నేనే సూర్యుని ద్వారా వేడినిస్తున్నాను మేఘం రూపంలో వర్షాన్ని కురిపిస్తున్నాను. నిగ్రహిస్తున్నాను కూడ. అమృతాన్ని, మృత్యువును, సత్తును, అసత్తును గూడా నేనే ,అయివున్నాను. వాస్తవంగా అన్ని యజ్ఞముల ఫలాన్ని అనుభవించేది, అన్నిటిని నియమించేది నేనే. ఈ నిజాన్ని తెలిసికోలేనివారు ఇతర దేవతారాధనలు చేస్తూ కర్మభ్రష్టులై తిరిగి తిరిగి పుడుతూ వుంటారు.

ఎవ్వడు పరిశుద్ధమైన మనస్సుతో, భక్తితో నాకు పత్రాన్ని గాని, పుష్పము గాని, ఫలము గాని, నీటిని గాని సమర్పిస్తూ యుంటాడో అట్టి దానిని నేను ప్రీతితో స్వీకరిస్తూ వుంటాను. నీవు చేసే సమస్త కర్మల్ని, సమస్త భోగాల్ని, హోమాల్ని, దానాలను, తపస్సులను నాకు అర్పింపుము. అట్లు చేయుట వలన పుణ్య పాపాలు నీకు అంటకపోగా కర్మబంధముల నుండి విడివడి నన్ను పొందగలవు.

# 10. విభూతి యోగము

భగవానుడు అనుపదమునకు అర్థము శక్తి, యశస్సు, ఐశ్వర్యము, జ్ఞానము, సౌందర్యము, వైరాగ్యము లనెడి ఆరు విభూతులను సక్రమముగా కలిగియున్నవాడని పరాశరముని వివరించి-యున్నాడు.తొలుత ఆది జీవుడైన బ్రహ్మదేవుడు హిరణ్యగర్భుడని తెలియబడు భగవానుని శక్తి నుండి ఉద్భవించెను. ఆ బ్రహ్మదేవుని నుండి సనక, సనంద, సనాతన, సనత్కుమారులును, మనువులును, ఆ తారువాత సప్త ఋషులు ఉద్భవించిరి. ఈ ఇరువది ఐదుమంది విశ్వము నందలి జీవులందరికి ప్రజాపతులుగా ప్రసిద్ధి చెందిరి. విశ్వమును సృష్టించు జ్ఞానమును పొందుటకు బ్రహ్మదేవుడు పూర్వము వేయి దేవతా సంవత్సరములు తపమాచరించి యుండెను.

సృష్టారంభమున దేవదేవుడైన నారయణు-డొక్కడే యుండెను. బ్రహ్మదేవుడుగాని, శివుడుగాని, అగ్నిగాని, చంద్రుడుగాని, ఆకాశము, నక్షత్రములు, సూర్యుడుగాని లేరు. మహఉపనిషత్తు (1) నందు శివుడు దేవదేవుని పాల భాగము నుండి జన్మించెనని

తెలుపబడినది.

**భగవానుడు పలికెను :-** అర్జునా ! నీవు నా మాటల్ని ఎంతో ప్రేమతో వింటున్నావు గనుక నీకింకను హితాన్ని కలిగించాలనే తలంపుతో కొన్ని శ్రేష్టమైన విషయాలు చెప్పబోతున్నాను. విను. నా ప్రభావాన్ని దేవతా సంఘాలుగాని, మహర్షులుగాని, ఎరుగరు. దేవతల పుట్టుకకు, ఋషుల పుట్టుకకు కారకుడను నేనే. నాకు పుట్టుక, ఆది లేవని తెలుసుకున్నవాడు మోహం లేనివాడై అన్ని పాపాల నుండి విముక్తి పొందగలడు.

లోకంలో ఏ భూతానికి ఏ భావం కలిగిన అది నా వల్లనే కలుగుతుంది. అనగా బుద్ది, జ్ఞానం, వివేకం, ఓర్పు సత్యం, సుఖం, దుఃఖం, జనన మరణాలు, బాహ్యేంద్రియ స్వాధీనత, అంతరేంద్రియ స్వాధీనత, భయం లేకుండ నుండటం, అహింస, తపస్సు , దానం, సమత్వం, సంతోషం, కీర్తి, అపకీర్తి లేకుండగ నుండుటం మొదలైన అన్ని భావాలు నా వల్లనే కలుగు-తున్నాయి. నా యొక్క ఈ విభూతిని యదార్థంగా తెలుసుకున్నవారే యోగ సిద్ధిని పొందుతారు.

**ఇది విన్న అర్జునుడు శ్రీ కృష్ణ పరమాత్మతో :-** కృష్ణా ! నీవే పరబ్రహ్మావు, గొప్ప తేజస్సు గలవాడవు,

పరమపావనుడవు, నిత్యుడవు, దివ్యుడవు, ఆది దేవుడవు, అజుడవు సర్వవ్యాపివి, మహాపురుషుడవు అని ఋషులు, నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు చెబుతున్నారు. అట్టి నీవు ఈ లోకాలలో ఏయే విభూతులచే వ్యాపించియున్నావో సంపూర్ణముగా వివరించుము అని అడుగగా శ్రీ కృష్ణ పరమాత్మ కొన్నిటిని వివరించసాగాడు.

అన్ని భూతాలలో యున్న ఆత్మను నేనే. అన్ని భూతాలయొక్క మొదలు, మధ్య, తుది కూడా నేనే. ఆదిత్యులలో విష్ణువును, వెలుగునిచ్చు వారిలో సూర్యుడను, మరుత్తులనే దేవతలలో మరీచిని, నక్షత్రాలలో చంద్రుడును, వేదాలలో సామవేదము, దేవతలలో ఇంద్రుడును, ఇంద్రియాలలో మనస్సును, రుద్రులలో శంకరుడను,యక్షరాక్షసులలో కుబేరుడను, వసుపులలో అగ్నియును, పర్వతములలో మేరువును, పురోహితులలో బృహస్పతిని, సేనా నాయకులలో కుమార స్వామిని, సరస్సులలో సముద్రడును, మహర్షులలో భృగు మహర్షియును, వాక్కులలో ఓం కారమును, యజ్ఞములలో జపయజ్ఞమును, స్థిరపదార్థములలో హిమాలయమును, చెట్లలో

రావిచెట్టును, దేవర్షులలో నారదుడను, గంధర్వులలో చిత్రరధుడను, సిద్ధులలో కపిలమునిని, గుఱ్ఱాలలో ఉచ్ఛైశ్రవమనే గుఱ్ఱాన్ని, ఏనుగులలో ఐరావతాన్ని, మనుష్యులలో రాజును, ఆయుధాలలో వజ్రాయుధము, పాడియావులలో కామ ధేనువును, సంతతి కలుగజేయువారిలో మన్మధుడను, సర్పాలలో వాసుకిని, నాగులలో అనంతుడను, జల దేవతలలో వరుణుడును, పితృ దేవతలలో ఆర్యముడను, శిక్షించువారిలో యముడను నేనే.

రాక్షసులలో ప్రహ్లాదుడను, మృగములలో సింహ్మమును, పక్షులలో గరుత్మంతుడను, వీచువానిలో గాలిని, శస్త్రములు ధరించువారిలో రాముడను, జల చరములలో మొసలిని, నదులలో గంగానదిని, విద్యలలో ఆధ్యాత్మ విద్యయు, అక్షరాలలో అకారమును, సమాసాలలో ద్వంద సమాసము, అంతటిని నశింపచేసే మృత్యువును నేనే. వృష్ణి వంశమువారిలో శ్రీ కృష్ణుడను, పాండవులలో అర్జునుడును, మునులలో వ్యాసుడను, కవులలో శుక్రుడును, జ్ఞానవంతులలో ఆత్మజ్ఞానమును నేనే. పరంతపా ! నా దివ్యములైన విభూతులకు అంతములేదు. ప్రపంచములో ఏదియేది

ఐశ్వర్యవంతమెూ, కాంతి యుక్తమెూ, ధృడమైన ఉత్సాహంతో గూడిన అది అంతయు నా తేజోంశము చేతనే కలిగిన దానిగా గ్రహించు. అర్జునా! నీ కింత వరకు చెప్పిన విభూతి యెుక్క విస్తారత నాలుగు వంతులలో ఒక వంతు మాత్రము చేతనే ఈ సమస్త జగత్తును వ్యాపించియున్నాను అని చెప్పాడు శ్రీ కృష్ణ పరమాత్మ.



## 11. విశ్వరూప సందర్శన యోగము

అర్జునుడు శ్రీ కృష్ణునకు తన భావాలను వివరించ ప్రారంభించాడు. కృష్ణా! నన్ను అనుగ్రహించేందుకు ఆధ్యాత్మిక విషయాలు అతి రహస్యమైన వాటిని చెప్పావు. నా అజ్ఞానం తొలగిపోయింది.

పురుషోత్తమా ! ఇదంతా నిజమే కాని, నీ విపుడు వర్ణించిన అసాధారణమైన నీ రూపాన్ని చూడాలని కోరుకుంటున్నాను. నీ రూపాన్ని నేను చూడటం సాధ్యమవుతుందని నీవు అనుకున్నట్లయితే నాశరహితమైన నీ రూపాన్ని నాకు చూపించు అన్నాడు. అది విన్న భగవానుడు అర్జునా! అనేక విధాలైన దివ్యములైన, అనేక రంగులు, రూపాలు గల వందల వేలాది రూపాలతో కనిపించే ఈ రూపాన్ని చూడు.

అర్జునా! పన్నెండు మంది సూర్యులు, అష్ట వసువులు, ఏకాదశ రుద్రులు, ఇద్దరు అశ్వనీ దేవతలు, నలభై తొమ్మిది మంది వాయువులు, ముందెప్పుడు నీవు చూడని అనేక వింతలు చూడు. ఇంతకు ముందు చెప్పిన చరాచర ద్రవ్యసముదాయంతో గూడిన సమస్త

జగత్తును, నా శరీరంలో ఇక్కడనే ఒక్కచోటనే ఉన్నవానికి చూడు. ఇంకా వేటిని చూడాలను కుంటున్నావో వాటి నన్నింటిని చూడు. నీ చర్మ చక్షువులతో నన్ను నీవు చూడలేవు కాబట్టి నీకు దివ్య దృష్టి నిస్తున్నాను. అనంత ఐశ్వర్యంతో కూడిన నా యోగశక్తిని చూడు అన్నాడు.

**సంజయుడు పలికెను :-** ఓ రాజా ! యోగాలన్నీ తెలిసిన యోగ యోగీశ్వరుడా విధంగా చెప్పి సర్వోత్తమమైన ఐశ్వర్య సంబంధమైన విశ్వరూపాన్ని అర్జునకు చూపించాడు. ఆ విశ్వరూపం అనేక ముఖాలు, అనేక నేత్రాలు కలదై అద్భుత రూపాల్ని దాల్చియుంది. అది అనేక దివ్యాభరణాలతో ప్రకాశిస్తోంది. ఎత్తబడిన ఆయుధాలు దేవ సంబంధమైన పుష్పాలు, బట్టలు, ధరించియును, అటువంటివేయైన గంధపు పూతల తోను, అంతం లేనట్టియు అన్ని ప్రక్కల ముఖాలున్నట్టియు దేవుని అర్జునుడు చూచాడు. ఆకాశంలో వేలాది సూర్యుల యొక్క కాంతి ఒక్కమారు బయలు దేరినట్లయితే అది ఎంతటి కాంతిని వెదజెల్లునో ఆ కాంతి మాత్రమే ఆ దేవుని కాంతికి సరిపోతుంది. అటువంటి విశ్వమూర్తిలో వివిధ భాగాలుగా పనిచేయు సకల

చరాచర జగత్తును ఒక్కచోట ఉన్న దానిగాచూచాడు. పిమ్మట అర్జునుడు విస్మయంతో పులకాంకితుడై అఖండ సత్తాయే తానుగా నిలిచిన శ్రీ కృష్ణునికి తలవంచి నమస్కరించి అంజలిబద్ధుడై (దోసిలోగ్గి) తన అనుభవాన్ని చెపుతున్నాడు.

**అర్జునుడు పలికెను :-** స్వామీ ! నీ దేహంలో దేవతలంతా కనిపిస్తున్నారు. సర్వభూత విశేషసంఘాలు కనిపిస్తున్నాయి. పద్మం మీద కూర్చున్న బ్రహ్మదేవుని చూస్తున్నాను. సమస్తమైన ఋషులును కనిపిస్తున్నారు, దివ్యులైన పన్నగులు గోచరిస్తున్నారు. ఎక్కడ చూచిన లెక్కలేనన్ని చేతులు, ఉదరాలు, ముఖాలు, కండ్లు కలిగి అనంతరూపుడవై నాకు తోస్తున్నావు. నీ ఆది మద్యాంతరాలు నాకు కనిపిస్తున్నాయి. కిరీటి, గద, చక్రాలు, ధరించి తేజోరాశియై యెల్లెడల ప్రకాశిస్తూ, కండ్లు మిరిమిట్లు గొలుపుతూ, ప్రకాశించే అగ్నివలె, సూర్యునివలె, కాంతి గలవానిగను, హద్దులేని వానిగను నిన్ను అన్ని దిశలలోను చూస్తున్నాను. నీవు అక్షరుడైన పరబ్రహ్మవు, తెలియబడదగిన వాడవు.ఈ విశ్వానికంతా ఆధారభూతుడవు. అవ్యయుడవు, శాశ్వత ధర్మ రక్షకుడవు. నీవు సనాతన పురుషుడవని నా

అభిప్రాయము.

నీవు ఆది మధ్యాంతాలు లేనివాడవు. అపరిమిత బలశాలివి. నీ యొక్కని చేతనే భూమ్యాకాశాల మధ్యభాగమును అన్ని దిక్కులను వ్యాపించి యున్నది. మహాత్మా! అద్భుతమైన నీ యుగ్ర రూపాన్ని చూచి ముల్లోకాలు భయపడుతున్నాయి. దేవతా సముహాలు నీలో ప్రవేశిస్తున్నాయి. కొందరు నీకు భయపడి దోసిలోగ్గి నిన్ను పొగడుతున్నారు. మహర్షులు, సిద్ధులు గుంపులుగా చేరి లోకాలకు క్షేమం కలుగుగాక అంటూ నిన్ను సంపూర్ణ స్తోత్రాలతో స్తుతిస్తున్నారు. రుద్రులు, సూర్యులు, వసువులు, సాధ్యులు, విశ్వదేవతలు, అశ్వనీ దేవతలు, వాయువులు, పితృదేవతలు, గంధర్వ యక్ష , రాక్షస సిద్ధ సంఘాలు అందరును ఆశ్చర్యంతో నిన్ను చూస్తున్నారు. నిండు వెలుగులో ఆకాశాన్నంటి యుండి అనేక రంగులతో నుండి తెరచియున్న నోళ్ళు, మండుచున్న విశాల నేత్రాలు కల నీ రూపు చూడటం వల్ల నా మనస్సె బెదరిపోతుంది. నాకు ధైర్యం చాలటం లేదు. శాంతిని పొందలేక యున్నాను. యుగాంతంలో అంతటిని కాల్చివేసే అగ్నివలె భయంకర కోరలతో కనిపిస్తున్న నీ

ముఖాలను చూచి దిగ్భ్రమమును పొందుచున్నాను నాకు సుఖం లేకుండా వుంది " దేవా " నన్ను అనుగ్రహింపుము.

ఈ యుద్ధ భూమిలో నున్న కౌరవులందరును, భీష్మ ద్రోణ కర్ణా ది సమస్త రాజసమూహాలున్ను ,అట్లే మా వారైన సైనిక శ్రేష్టులు గూడ కోరలు గల భయంకరమైన నీ నోటిలో తొందరగా ప్రవేసిస్తున్నారు. కొందరు నీ పండ్ల సందులలో చిక్కుకొని తలలుపొడుం చేసుకున్నట్లు కనిపిస్తున్నారు. దేవతా శ్రేష్ఠా ! ఆది పురుషుడవైన నిన్ను తెలుసు కోవాలనుకుంటున్నాను. నీ ఎవరివో నాకు చెప్పు. నీకు నమస్కారం. నన్ను అనుగ్రహించు అని అర్జునుడు వేడుకున్నాడు.

**శ్రీకృష్ణ భగవానుడు పలికెను :-** నేను లోక నాశనం చేసేందుకు వ్యాపించియున్న కాలాన్ని , లోకనాశనం చేయాలని శ్రీ కృష్ణ దేహంతో యిక్కడ వ్యవహరిస్తున్నాను. నీ శత్రుసేనలో నున్న వీరులంతా నీవు యుద్ధంలో కలుగజేసుకొనక పోయినప్పటికిని ప్రాణాలతో ఎవ్వడూ మిగలడు. నా విశ్వరూపంలో నీవు చూచినట్లు వీళ్లంతా యుద్ధం చేయకముందే నాచే

చంపబడ్డారు. నీవు లేచి, శత్రువున్ని గెలిచాడనే కీర్తిని, రాజ్యాన్ని పొందు. అర్జునా! నీవు నా చేతిలోని స్వల్ప ఉపకరణానివి. నిమిత్రమాత్రుడవు. అంతా నేనే చేస్తుంటాను.

**అర్జునుడు పలికెను :-** కృష్ణా ! నీ గొప్ప కీర్తి చేత లోకాలు సంతోషించడం, అనురాగం చూపటం, రాక్షసులు భయపడి దిక్కులకు పరుగెత్తటం, సమస్త సిద్ధ సమూహాలు నీకు నమస్కరిస్తూ ఉండటం, నీ మహిమకు తగినట్లేయుంది. ఇటువంటి నీ మహిమ తెలుసుకొనలేక సామన్య స్నేహితుడవనుకొని " కృష్ణా! యాదవా! సఖా! " అంటూ చనువుచేతను, ప్రమాదం వల్ల నేమి అవినయంగా పిలిచాను. నీవు విహరించే వేళ, పరుండియున్నపుడు, కూర్చుండి యున్నవేళ, భోజనం చేసే సమయంలోను, ఒంటరిగా నున్న పుడు, అందరిలో నున్నపుడు నిన్ను వేళాకోళం కొరకు నేను అవమానించాను. ఈతప్పలు లెక్కపెట్టక నన్ను క్షమించమని ప్రార్థిస్తున్నాను.

ఇటువంటి రూపాన్ని నేనెప్పడూ చూచి యుండకపోవటం వల్ల ఇప్పడు చూచి సంతోషిస్తున్నాను కాని నా మనస్సు భయంతో బాధ

పడుతుంది. అందుచేత నీవు పూర్వపు రూపాన్నే నాకు చూపించు. నన్ను అనుగ్రహించు. కిరీటి, గద, చక్రాలు ధరించియున్న నీ వెనుకటి రూపాన్నే చూడగోరు-తున్నాను. కాబట్టి ఓ విశ్వరూప ! నీ సహస్ర బాహువులు విడిచిపెట్టి నాలుగు చేతులతోనే నాకు కనుపించు.

**భగవంతుడు పలికెను :-** పార్థా! ఇంతవరకు ఎవ్వరునూ చూడని నా విశ్వరూపాన్ని నీయందు నాకున్న అనుగ్రహం వల్ల నా యోగ శక్తితో నీకు చూపించాను. నా విశ్వరూపాన్ని నీవు తప్ప ఇతరులెవ్వరును యజ్ఞ దాన వేద తపోధ్యయనాల వల్ల కూడా చూడలేరు. నీవు నిర్భయంగా సంతోషంగా ఉండు. నీవు కోరుకున్న విధంగానే నన్ను చూడు అన్నాడు.

**అర్జునుడు పలికెను :-** జనార్ధనా ! నీ యీ సౌమ్య మానవ రూపాన్ని చూచి యిప్పుడు మామూలు స్థితికి వచ్చాను అన్నాడు.

**శ్రీ కృష్ణ పరమాత్మ పలికెను :-** అర్జునా ! నీవిపుడు చూచిన నా రూపాన్ని సాధారణంగా తెలియదగినది కాదు. దేవతలు గూడా ఇటువంటి రూపాన్నే ఎల్లపుడు చూడాలని కోరుకుంటూ యుంటారు. అనన్యమైన భక్తి వలన ఎవ్వడైన నన్ను ఈ విధంగా తెలిసికోవటానికి,

యదార్ధ జ్ఞానంతో చూచేందుకు, నా యందు ప్రవేశించేందుకు వీలవుతుంది, పాండవా ! కర్మల్ని నా కర్పిస్తూ నన్నే పరమంగా తలుస్తూ నాకు భక్తుడై ఫలాశక్తిని విడిచి అన్ని భూతముల యందును విరోధం లేకుండగా ఉండేవాడు నన్ను చేరుకుంటాడు.



# 12. భక్తియోగము

**అర్జునుడు అడిగెను :-** " దేవా ! నీకు ఇష్టమైన పనులు చేస్తూ నీకు భక్తులై నిన్ను సేవించేవారును, అక్షరమును, అవ్యక్తమును అయిన నిర్గుణ తత్త్వాన్ని ఉపాసించే వారును, అనే రెండు రకాల వారిలో ఎవరు ఉత్తమ యోగులో చెప్ప" మని అడిగాడు.

**శ్రీకృష్ణపరమాత్మ చెప్పెను :-** అర్జునా ! నాయందు మనస్సు నుంచి ఎల్లప్పుడు ప్రీతికరాలైన పనులు చేస్తూ శ్రేష్టమైన శ్రద్ధతో నన్నుపాసించేవారే అందరికంటె ఉత్తమ యోగులని నా అభిప్రాయము. అన్ని భూతాలకు మేలుకోరుకుంటూ , అంతటను సమబుద్ధితో నడుచు-కొంటూ, ఇంద్రియాల్ని స్వాధీన పరచుకొని, అన్నిచోట్ల వర్తించునది, ఆలోచించేందుకు వీలులేనిది, నిర్వికారమైనది, చలింపనిదీ, స్థిరముగా నుండేది అయిన అవ్యక్త రూపాన్ని ఉపాసించే వారికి శ్రమ ఎక్కువగా యుంటుంది. దేహం మీద అభిమానం ఉన్నవారికి అవ్యక్తాన్ని గురించిన మార్గం దు:ఖ జనకంగా ఉంటుంది. సర్వకర్మల్ని నా యందుంచి. నా యందాసక్తి కలిగి ఇతరమును తలంచని యోగనిష్ఠతో

నన్ను ధ్యానిస్తూ యుండే వానిని మృత్యువుతో గూడియున్న సంసార సాగరము నుండి నేను త్వరగా ఉద్ధరిస్తాను. నాయందే నీమనస్సు నిలుపు, నీబుద్ధిని నాలో ప్రవేశపెట్టు. ఆ తరువాత నిస్సందేహంగా నీవు నా యందే నివసిస్తావు.

అర్జునా ! నిమితమైన కర్మచేస్తూనే నీ మనస్సును స్థిరంగా నిలుపుకోవటానికి శక్తి చాలకపోయిట్లయితే అభ్యాసమనే యోగంతో నన్ను పొందకోరుకో. అభ్యాసానికి గూడా తగిన శక్తి చాలక పోయినట్లయితే, నాసంబంధమయిన కర్మల్ని చేస్తున్నప్పటికి సిద్దిని పొందగలవు. నా సంబంధమైన కర్మలు గూడా చేయలేకపోయినట్లయితే నాయందు నీ బుద్ధిని సమస్థితిలో నిలిపి, మనో నియమం కలిగి నీవు రోజూ చేసే అన్ని పనుల ఫలితాన్ని నా కర్పిస్తూ యుండు. అభ్యాస యోగం కంటె జ్ఞానం గొప్పది, జ్ఞానం కంటె ధ్యానం గొప్పది. ధ్యానం కంటె కర్మఫల త్యాగం మహత్తరమైనది. కర్మఫల త్యాగం వల్లనే శాంతి లభిస్తుంది. ధ్యానాభ్యాసికి ధ్యాన కాలమందు మాత్రమే చిత్తము నిర్విషయ- మైయుంటుంది. కాని కర్మఫల త్యాగికి ఎల్లప్పుడు అట్లేయుండును. కనుకనే అభ్యాసము కంటె జ్ఞానము, జ్ఞానము కంటె ధ్యానము, ధ్యానము కంటె కర్మఫల త్యాగము శ్రేష్టమైనది.

సమస్త ప్రాణుల యెడల ద్వేషము లేనివాడు, మైత్రి, కరుణ గలవాడు. ఇది నా దనేమమకారం లేని వాడును, దీనిని నేనే చేసానని అహంకారము లేని వాడును,సుఖదు:ఖము లందు సమభావము గలవాడు, ఓర్పు, సంతుష్టి గలవాడు, యోగ యుక్తుడు, మనస్సును స్వాదీన పరచుకొన్నవాడు, ధృఢమైన నిశ్చయము గలవాడు. మనో బుద్ధులను నా యందు సమర్పించి యున్నవాడు. నా యందు భక్తిగలవాడును అయిన భక్తుడు నాకు మిక్కిలి ప్రియమైనవాడు .

కోరికలు లేనివాడు, బాహ్యాంబతర శుద్ధిగలవాడు , కార్యసమర్ధుడు, తటస్ధుడును, దిగులు లేనివాడును, సమస్త కార్యములందు కర్తృత్వము వదలినవాడును అయిన భక్తుడు నా కెంతో ఇష్టుడు. ఇష్టమని పొంగిపోక, అయిష్టమని ద్వేషింపక, పోయినదాని కొరకు ఏడ్వక, లేనిదాని కొరకు ఆఱ్ఱులు చాపక శుభా శుభములు గూడా వదలిపెట్టి నాకు భక్తుడై యుండేవాడు అంటే నాకెంతో ప్రేమ. శత్రుమిత్రులయందును, మానావమానముల యందును, శీతోష్ణ దుఃఖములందు, నిందాస్తుల-

యందును, సమభావము కలిగియుండే వాడును. ధూషణ భూషల్ని తృణీకరించే వాడును, దొరికిన దానితో సంతృప్తి నొందువాడు, నిర్ధిష్టమగు నివాసము లేనివాడును, నిశ్చయమగు బుద్ధిగల వాడును, భక్తితో కూడియుండువాడనిన నా కెంతో ఇష్టము. ఎవడు శ్రద్ధావంతులై నన్నే పరమగతినమ్మి ఈ మోక్షసాధనమైన ధర్మమును అనుష్టించుదురో అట్టివారు నాకు ఇష్టులు.



# 13. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము

**అర్జునుడు అడిగెను :-** కృష్ణా ! ప్రకృతి పురుషులు, క్షేత్ర క్షేత్రజ్ఞులు, జ్ఞానాజ్ఞానాలు అనే స్వభావ లక్షణాలను గురించి తెలుసుకోవాలను కుంటున్నాను అని అడిగెను.

**శ్రీ కృష్ణ పరమాత్మ ఇలా వివరించసాగాడు :-** క్షేత్రమనగా శరీరము. క్షేత్రజ్ఞుడనగా ఆత్మ. జీవుడు వాస్తవముగా క్షేత్రజ్ఞుడేగాని క్షేత్రము కాదు. సమస్త క్షేత్రములందును (శరీరములందు) యున్న నన్ను క్షేత్రజ్ఞునిగ నెఱుంగుటయే ఉత్తమ జ్ఞానమని నా సిద్ధాతాము.

భూమి, నీరు, కాంతి, గాలి, ఆకాశము అనే పంచభూతాలు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు, అనే జ్ఞానేంద్రియాలు, మాట, కాళ్ళు, చేతులు, వాయు, ఉ పస్థలమనే కర్మేంద్రియాలు మనస్సుతో కూడి పదకొండు ఇంద్రియాలు ఇంద్రియ గోచరాలైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలైదును, కోరిక, ద్వేషం, సుఖం, ధు:ఖం అనే దేహేంద్రియ సంయోగం వల్ల కలిగేటి చేతన, ధైర్యం అనే వికారాలతో గూడినది ఈ క్షేత్రం

అని సంక్షింపంగా చెప్పబడింది.

1. అభిమానము లేకుండుట, (తన్నుతాను పొగడకొనుకుండుట) 2. డంబం లేకుండుట, 3. పరప్రాణులను హింసించకుండుట 4. ఓర్పుగలిగి యుండుట, 5. శౌచం 6. గురుసేవ చేయుట 7. బాహ్యాంతర శుద్ధి 8. సన్మార్గమున స్థిరముగ నుండుట 9. మనస్సును బాగుగా నిగ్రహించుట 10. ఇంద్రియ విషయములందు విరక్తి గలిగియుండుట 11. అహంకారము లేకుండుట 12. పుట్టుక, చావు, ముసలితనము, రోగము అను వాని వలన కలుగు దు:ఖములను మాటి మాటికి స్మరించుట 13. ఇల్లు, భార్య, కొడుకులు అను వానియందు ఆస్తకి లేకుండుట 14. ఇష్టానిష్టములు గలిగినపుడు సమ బుద్ది గలిగియుండుట 15. భగవంతుని యందు అనన్యభక్తి గలిగియుండుట 16. ఏకాంత ప్రదేశము నా శ్రయించుట 17. జనసముదాయము నందు ప్రీతి లేకుండుట 18. నిరంతరము ఆధ్యాత్మజ్ఞానము కలిగియుండుట 19. తత్త్వజ్ఞానము యొక్క గొప్పప్రయోజనము

తెలిసికొనుట 20. కాలాన్ని దుర్వినియోగం చేయకుండుట అనేవి జ్ఞాని యొక్క లక్షణములు.

అట్లే జ్ఞేయ వస్తువగు పరమాత్మ నెఱింగినచో దాని ఫలితము అమృతత్వమే, మోక్షమే. ఆది (ఆ బ్రహ్మము, ఆత్మ) అంతట చేతులు , కాళ్ళు , కన్నులు, ముఖములు, చెవులు గలదై సమస్త ప్రపంచ మంతటను వ్యాపించియున్నది. అన్ని ఇంద్రియములతో ప్రకాశిస్తున్నట్లు న్నప్పటికి ఏ ఇంద్రియములు లేనిదియు దేనిని అంటనిదయ్యును, అంతటిని ధరించునదియును, మూడు గుణాలకు అంతీతమైన దయ్యును, గుణానుభవం పొందేదియును ఏదైతే ఉందో అదే జ్ఞేయమని గ్రహించు. (ఒక వస్తువు కదులుచును, కదలకను యెట్లుండును? స్వప్నంలో మనుజుడు స్వప్నలోక దృష్ట్యా కదులుచున్నను వాస్తవముగా అతడు తన పడకపై కదలకనే పరుండియున్నాడు. అట్లే స్వప్న తుల్యమగు ఈ జగత్తునందు ప్రాణి కోట్ల రూపమున కదులుచున్నను వాస్తవముగ బ్రహ్మరూపమున నిశ్చలముగా కదలకనేయున్నాడు.)

ప్రకృతి, పురుషుడు అనాదియని చెప్పబడును. కార్యాకారణములను కలుగుజేయుట యందు ప్రకృతి

హేతువనియు, సుఖ దు:ఖములను అనుభవించు-టయందు పురుషుడు హేతువనియు చెప్పబడినది. (కార్యమనగా - శరీరము, కారణమనగా - ఇంద్రియ మనోబుద్ధ్యహంకారములు, పంచభూతములు, శబ్దాది విషయములు)

జీవుడు ఉత్తమ నీచజన్మలను పొందుటకు కారణము గుణములతో, ప్రకృతితో, ఉపాధితో కలయికయే కారణమైయున్నది. ఈ దేహమందు శ్రేష్టుడయిన పురుషుడు సాక్షాత్ పరమాత్మయే యనియు, దేహేంద్రియములు కాదనియు భావనచేయవలయును. ఎవడీ ప్రకారముగ పురుషుని (ఆత్మను), గుణములతో గూడిన ప్రకృతిని తెలుసుకొనుచున్నాడో అతడే విధముగ జీవించుచున్నప్పటికి మరల జన్మము నొందడు.

ప్రతి కర్మక్షేత్రమున జీవాత్మ పరమాత్మ అను రెండు ఆత్మలు కలవు. జీవాత్మ ఒక దేహమునకే పరిమితము కాగా పరమాత్మ అన్ని దేహములందుండు క్షేత్రజ్ఞుడు. నేను అను భావనను దేహమునకు అన్వయించినచో అట్టి భావనను మిధ్యాహంకారము అందురు.

తాను చేస్తున్న కర్మ ప్రకృతి చేతనే చేయిబడుతున్నట్లును, ఆత్మ ఏ విధమైన కర్మ చేయదనియు ఎవడు చూస్తుంటాడో వాడే జ్ఞాని. సూర్యుడు ఒక చోటనే నిలిచియుండి సమస్త విశ్వమును ప్రకాశింపజేయునట్లు, దేహము నందలి హృదయములో నిలిచి యున్నట్టి అణు ఆత్మ చైతన్యము చేతనే దేహమునంతటిని ప్రకాశింప జేయుచున్నది. కాని దేహము నుండి అది వెడలిపోయినంతనే చైతన్యము ఆగిపోవును. అనగా ఆత్మలేని దేహము చైతన్యరహితమగును.

దేహము, దేహ యజమానియైన ఆత్మ, పరమాత్మ అనెడి మూడు అంశముల నడుమ గల బేధమును తెలిసికొన్నవాడు తాను చేయవలసిన అన్ని రకాల కర్మల్ని చేస్తున్నప్పటికిని తిరిగి జన్మింపడు.



## 14. గుణత్రయ విభాగ యోగము

ప్రపంచములో అనేక జ్ఞానములున్నను భగవానుని దృష్టిలో ఆధ్యాత్మిక జ్ఞానమే సర్వశ్రేష్టమైన దని చెప్పచున్నారు. తమ పూర్వకర్మలననుసరించి వివిధ రూపములను (దేహములము) పొందు జీవులు భౌతిక ప్రకృతి గర్భమున బీజరూపమున ఉంచబడుదురు. ప్రకృతి వలన పుట్టిన సత్త్వరజస్తమో గుణములు మూడును ఆత్మను దేహము నందు బంధించుచున్నవి.

సత్వగుణము మిగిలిన రెండుగుణములు కన్నను పవిత్రమైనదగుటచే ప్రకాశమానమై మనుజుని సర్వపాప ఫలముల నుండి విముక్తిని జేయును, కాని జీవుడు సత్వగుణము నందు స్థితుడైనంతనే తాను జ్ఞానాభి వృద్ధి నొందితిననియు, మరియు ఇతరుల కన్నను గొప్పవానిగ తలచును. ఆ విధముగా సత్వగుణము సుఖాసక్తిని, జ్ఞానాసక్తిని కలిగించును గాన జీవుడు బద్దుడగును. విజ్ఞాన శాస్త్రవేత్తలు మరియు తత్త్వజ్ఞలు ఇందుకు చక్కని నిదర్శనము. సత్త్వగుణము యందున్న వారు ఆ గుణమన

వర్తించుటకు ఆకర్షితులై యున్నంత వరకు ఏదియో ఒక దేహమును స్వీకరింపవలసివచ్చును.

తరువాత రెండవది రజో గుణము. స్త్రీ పురుషుల నడుమ గల ఆకర్షణ రజోగుణ లక్షణము. ఇట్టి రజోగుణము అధికమైనపుడు మనుజుడు భౌతికానందాభిలాషుడై ఇంద్రియ సుఖములు ననుభవించ గోరును. అట్టి ఇంద్రియ సుఖము కొరకు రజోగుణము నందున్నవాడు సంఘము నందు గౌరవమును, చక్కని ఇల్లు ,భార్య, సంతానము కోరుకొనుచుండును. ఇట్టి విషయములకై ప్రాకులాడి నంత కాలము అతడు అధికముగా శ్రమించ వలసివచ్చును. దీనిని బట్టి భౌతిక ప్రపంచమంతయు దాదాపు రజోగుణము నందు ఉన్నదనియే చెప్పవచ్చును.

ఇక మూడవది తమోగుణము. వాస్తవమునకు తమో గుణము, సత్త్వగుణమునకు పూర్తిగా విరుద్ధమైనది. సత్త్వగుణము నందున్నవాడు జ్ఞానాభివృద్ధి కారణముగా ఏది ఎట్టిదో తెలుసుకొన గలుచుండ తమోగుణము నందున్నవాడు బుద్ధి హీనతను గలిగి ఏది ఎట్టిదో ఎరుగక ప్రగతికి బదులు

పతనము చెందుచుండును. తమోగుణము నందున్నవాడు సదాచింతా క్రాంతుడై మత్తు పదార్థములకు, నిద్రకు అలవాటు పడియుండును. ఇతనికి మత్తు, సోమరితనము, అజాగ్రత్త, బుద్ధి మాంధ్యము, అజ్ఞానము అనునవి ఎక్కువగా యుండును.

కొన్నిమార్లు రజస్తమో గుణములను జయించి సత్త్వగుణము అభివృద్ధి చెందుచుండును. కొన్నిమార్లు రజోగుణము సత్త్వతమోగుణముల నధికమించు-చుండును. ఇంకొన్ని మార్లు తమోగుణము సత్త్వర జోగుణములను అధికమించుచుండును. సత్త్వ గుణము నందుండి మరణించిన వాడు మహర్షులు పొందు ఉన్నత పవిత్ర లోకములను పొందును. ఈ భౌతిక జగమున సత్త్వగుణమనునది అత్యంత పవిత్రమైయున్నది. రజోగుణమునందుండి మరణించినవాడు కామ్యకర్మరతుల ఇండ్లయందు జన్మించును. తమోగుణము నందుండి మరణించి-నవాడు మూఢజనులందో లేక పశుపక్ష్యాదులందో జన్మించును. సత్త్వగుణము నందుండి చేయు పుణ్యకర్మల ఫలితము నిర్మలత్వము లేదా పవిత్రత్వము

కలుగజేయును. అందుకే మోహరహితులైవారు సదా ఆనందము నందే స్థితులై యుందురు. రజోగుణము నందు చేయబడు కర్మలు కేవలము దు:ఖ పూర్ణములే నాకీ గృహమున్నది, ధనమున్నది అనెడి సంతోషము లేదా సుఖము వాస్తవమునకు అశాశ్వతమైనదే.

ఇక తమో గుణము నందుండిన వాని కర్మలన్నియు దు:ఖమును కలిగించునవియేయై యుండును. తమో గుణము అభివృద్ధిలో నుండినపుడు జీవునకు మరుపు, సోమరితనము, అవివేకం, మూఢత్వము కలిగించును.

జీవుడు చేయు సమస్త కర్మలకు త్రిగుణమలే కర్త. అనగా త్రిగుణాత్మకమగు మనస్సు, ప్రపంచములోని సమస్త దు:ఖములకు కారణము ఈ త్రిగుణములే. అనగా జీవుడు గుణములతో, మనస్సుతో, దేహముతో నైక్యమై, నేను చేయుచున్నాను, నేను పుట్టుచున్నాను, నేను చచ్చుచున్నాను అని కర్తృత్వము కలిగి యుండును. ఇదియే బంధమునకు కారణము. దీని నుండి విడివడిన జీవుడు మరు క్షణమే భగవత్ స్వరూపమును బొందును.

నిజమైన ఆధ్యాత్మిక గురువు శ్రీ కృష్ణుడే. అతడే ఇచట అర్జునునకు ఆధ్యాత్మిక జ్ఞానము నందించు

చున్నాడు. వాస్తవమునకు జీవుడెన్నడును వివిధ కర్మలకు కర్త కాడు.

**అర్జునుడు అడిగెను :-** కృష్ణా! ఈ మూడు గుణాలను అతి క్రమించినవాడు ఏ లక్షణాలు కలిగియుండి ఏ విధమైన ప్రవర్తనను కలిగి యుండును? అర్జునా! త్రిగుణాతీతుడు సత్త్వగుణ సంబంధమైన ప్రకాశాన్నిగాని, రజోగుణ సంబంధమైన ప్రవృత్తినిగాని, తమో గుణసంబంధమైన మోహంగాని కలిగినపుడు వాటివల్ల చలింపక ఆయా గుణధర్మాలు ఆయా విధంగా ప్రవర్తిస్తూ ఉంటాయనుకొని ఉదాసీనంగా వుంటూ, స్థిర చిత్తంతో సుఖ దు:ఖాలను సమానంగా భావిస్తూ, మనసు కుదట పరచుకొని, మట్టిపెళ్లను, బంగారాన్ని ఒకే మాదిరిగా చూస్తూ, ప్రియ అప్రియములను ఒకటిగానే భావిస్తూ, ధైర్యంతో తన్నుపొగిడినా, తిట్టినా లెక్కపెట్టక, గౌరవం లేదా అవమానం కలిగినా చలింపక, శత్రుమిత్ర బేధబుద్ది లేక ఫలాపేక్ష లేనివాడై స్థిరమైన బుద్ధి కలిగియుండును.

జీవుడు దేహధారియైనను ఆధ్యాత్మిక జ్ఞానము నందు అభివృద్ధిని పొందినచో త్రిగుణముల ప్రభావము నుండి బయటపడి ఈ దేహమునందే ఆధ్యాత్మిక ఆనందమును అనుభవించగలడు.

# 15. పురుషోత్తమ ప్రాప్తి యోగము

**పురుషోత్తముడగు శ్రీ కృష్ణ భగవానుడు పలికెను. :-** వేళ్ల ఊర్ధ్వముగాను, శాఖలు క్రిందుగ గాను, వేదబుక్కులే ఆకులుగను కలిగిన శాశ్వతమైన అశ్వత్థ వృక్షమొకటి కలదని చెప్పబడును. ఆ వృక్షము నెటిగిన వాడే వేదముల నెరిగినవాడు.

భౌతిక జగత్తు బంధము ఇచ్చట అశ్వత్థ వృక్షముతో పోల్చబడినది. కామ్య కర్మల యందు రతుడైన వాడు ఈ అశ్వత్థ వృక్షపు తుదిని తెలియక ఒక కొమ్మ నుండి వెరొక కొమ్మకు సదామారు చుండును. వ్రేళ్ళ పై భాగమున మరియు కొమ్మలు క్రింది భాగమున గల వృక్షపు ప్రత్యక్షానుభవము ఈ ప్రపంచమున లభించకపోయినను, అటువంటిది మాత్రము ఏదైన జలాశయము నందు గాంచ వచ్చును. జలాశయము నందలి వృక్షము నీటియందు ప్రతిబింబించి మూలము ఊర్ధ్వముగాను శాఖలు క్రిందుగను ఉన్నట్లు గోచరించును.

ఈ వృక్ష శాఖలు ప్రకృతి త్రిగుణములచే పోషింపబడి ఊర్ధ్వ అధోముఖముగా వ్యాపించి యున్నవి. దీని చిగుళ్ళే ఇంద్రియార్ధములు.

అధోముఖముగా వున్న ఈ వృక్షపు వేళ్ళు మనుష్యలోకపు కామ్యకర్మలకు సంబంధించినవై యున్నవి. ఈ వృక్షపు యదార్ధ రూపము ఈ జగమునందు తెలియబడదు. దాని ఆదికాని అంతము గాని మూలముగాని ఎవ్వరును అవగతము చేసికొన జాలరు. కాని స్థిరముగా నాటుకొని పోయియున్న ఈ సంసార వృక్షమును మనుజుడు ధృఢ చిత్తముతో, అసంగమను శస్త్రముచే ఛేదించి వేయవలయును. ఆ పిదప పునరావృత్తి రహితమైన దివ్యపదమును పొందుటకు ప్రయత్నించి, అనాది కాలము నుండి ఎవ్వని వలన సమస్తము ఆరంభమయ్యెనో, వ్యాప్తి నొందెనో అట్టి పరమ పురుషుని శరణు పొందవలయును.

ఈ వృక్షపు మూలము ఊర్ధ్వముగా నున్నందున ఈ వృక్షపు విస్తారము క్రిందుగా నున్నది. అట్టి వృక్షము యొక్క విస్తారము నందు బద్ధుడైన మనుజుడు వృక్ష కారణమును కనుగొనియే తీరవలెను.

నేను ఫలానా వారి కుమారుడను, నా తండ్రి ఫలానా వారి కుమారుడు, అనుచు పరిశోధన గావించుచు పోయినచో చివరకు గర్భోధక శాయి విష్ణువు నుండి ఆవిర్భవించిన బ్రహ్మదేవుడు సర్వులకు

మూలమని తెలియును. చివరకు బ్రహ్మాదేవునికి ఆదియైన శ్రీ కృష్ణుని చేరిన పిమ్మట పరిశోధన పరిసమాప్తి కాగలదు.

మిధ్యాహంకారము, భ్రాంతి, దుస్సాంగత్యముల నుండి విడివడిన వారును, శాశ్వతత్త్వమును అవగతము చేసికొనిన వారును, ఆధ్యాత్మమునే ఎప్పడూ భావించేవారును, కామవర్జితులును, సుఖ దు:ఖములనెడి ద్వందములనుండి బయటపడిన వారును భ్రాంతి రహితులై ఆ పరమ పురుషుని పొందగలరు. మాయాజనిత గర్వము వలన మానవుడు జగమందు కొద్దికాలమే నివసించు వాడైనను జగత్తునకు తానే ప్రభువనెడి మూర్ఖభావనను కలిగియుండును. అట్టి భావనచే విషయములను కష్టతరము గావించుకొని దు:ఖ భాగుడైయుండును.

అర్జునా! నా దివ్యధామము సూర్యునిచేగాని, చంద్రునిచేగాని, అగ్ని, విధ్యుత్తుచేగాని, ప్రకాశింపజే-యబడదు. దానిని చేరిన వారు ఈ భౌతిక జగమునకు తిరిగిరారు. ఆధ్యాత్మిక లోకములన్నియు స్వయం ప్రకాశమానములు గనుక ఆ జగత్తునందు సూర్యకాంతి, చంద్రకాంతి, అగ్ని, విద్యుత్తుల అవసరము

లేదు. ఈ జగత్తులో సూర్యుడొక్కడే స్వయం ప్రకాశమానుడు. కాని ఆధ్యాత్మిక జగత్తులోని లోకములన్నియు స్వయం ప్రకాశములే.

ఈ భౌతిక జగత్తునందలి జీవులందరును నా శాశ్వతాంశములు. బద్ధ జీవనము కారణముగా మనస్సుతో కలిసి ఆరు ఇంద్రియములతో గూడి తీవ్ర సంఘర్షణ నొందుచున్నారు. పరమ పురుషుని అంశమైన ఆత్మ దేహబంధముల నుండి ముక్తి నొందినపుడు ఆధ్యాత్మిక జగమునందు ఏదోఒక దివ్యలోకమున తన ఆధ్యాత్మిక దేహమును పొంది శ్రీ కృష్ణ భగవానుని సహచర్యమును అనుభవించును. శరీరమును వీడునపుడు గాని, క్రొత్త శరీరమును గ్రహించునపుడు గాని జీవుడు తనతో పాటు మనస్సును, ఇంద్రియములను (అనగా చెవిని, కంటిని, ముక్కును, చర్మాన్ని, నాలుకను) వాని వాని యందుండు సంస్కారములను గోనిపోవును. ఎట్లనగా వాయువు సుగంధపు వస్తువు నుండిగాని, దుర్గంధపు వస్తువు నుండిగాని ఆయా సుగంధ, దుర్గంధ వాసనలను గొనిపోవునట్లు.

జీవునకు ఏ విధముగా తన దేహమును

విడుచునని గాని, గుణముల కారణముగా ఏ దేహమును పొందబోవునని గాని మూఢులు ఎరుగజాలరు. కాని జ్ఞాన చక్షువులు కలిగిన వారు ఈ విషయమును చక్కగా గాంచగలరు. ప్రతి యొక్కరు సూర్యుడు, చంద్రుడు, అగ్ని విద్యుత్తులను గాంచుచునేయుందురు. అట్టి తేజము దేవ దేవుని నుండియే గలుగుచున్నదని ఎరుగ వలయును. ఆత్మ దేహమునందున్నంత వరకు మనుజుడు నీటిపై తేలగలిగినను, ఆత్మ దేహమునుండి తొలగినంతనే మరణించి నీటియందు మునిగిపోవును. అదే విధముగా గ్రహములన్నియును అంతరిక్షమున తేలుటకు ఆ భగవానుని దివ్యశక్తి వాటియందు ప్రవేశించి యుండుటయే కారణమని తెలుసుకొన వలయును.

పరమాత్మ జీవుల శరీరములో జఠరాగ్ని రూపమున నుండి ప్రాణాపాన వాయువులతో గూడికొని వారు భుజించు నాలుగు రకములైన ఆహరమును పక్వం చేయుచున్నారు. జీర్ణక్రియ యందు భగవానుడు తోడ్పడనిదే జీవునకు ఆహరము భుజించు అవకాశము గలుగదు. ఈ విధముగా శ్రీ

కృష్ణ భగవానుడు జీర్ణకారక శక్తి రూపమున దేహమునందు స్థితుడైయున్నాడు. సర్వ హృదయములందు నేను నిలిచియున్నాను. నా నుండియే స్మృతి, జ్ఞానము, మరుపు అనునవి కలుగుచున్నవి. నేనే సమస్త వేదములు ద్వారా తెలియదగినవాడను. వాస్తవమునకు వేదాంత కర్తను, వేదములు నెరిగినవాడను నేనే. సర్వజీవుల హృదయమున నుండు పరమాత్మ నుండియే జీవుని సర్వ కర్మలు ఆరంభమగుచున్నవి. గత జన్మవిషయములను జీవుడు మరిచినను సమస్త కర్మలకు సాక్షిగా నుండే భగవానుని నిర్దేశము ననుసరించియే జీవుడు వర్తించవలసి వచ్చును. కావున కర్మల నొనరించుటకు కావలసిన జ్ఞానము స్మృతి భగవానుని నుండియే గలుగుచున్నవి. గత జన్మమును గూర్చిన మరుపు గూడ భగవానుని వలననే కలుగచున్నది. దీనిని బట్టి మానవుల మానసిక ప్రవృత్తులను గూడా భగవానుడు గమనించుచున్నట్లు, వారికి తెలియకుండా ఏదియు జరుగదని తెలుసుకొనవలయును.

ఈ లోకంలో క్షరుడనియు, అక్షరుడనియు

ఇరువురు పురుషులు గలరు. నశించునట్టి చరాచర జీవుల యొక్క ఉపాదులన్నియు క్షర పురుషులనియు, మాయ యందుండి మాయా వికారాలు పొందని కూటస్థుడే అక్షర పురుషుడు. క్షరమైన దేహముతో పోల్చి చూచినచో మోక్ష పర్యంతము అనేక జన్మల కాలము వరకు నశింపకుండు వాడగుటచే జీవుడు ' అక్షరుడని చెప్పబడెను. ఈ క్షరాక్షర పురుషుల కంటె వేరైనవాడు ఉత్తమ పురుషుడు. అతడే పరమాత్మ. అతడు ముల్లోకములను భరించు వాడును, జగన్నియామకుడును, నాశరహితుడును అయియున్నాడు.

భౌతిక జగమున గోచరించు జన్మము, వృద్ధి, స్థితి, ఇతర జీవుల సృష్టి, క్షయము, వినాశములనెడి మార్పు జీవుని దేహమునకు సంబంధించినవి, కాని ఆధ్యాత్మిక జగము నందు దేహము మార్పు చెందదు. అచట వృద్ధాప్యము లేదు. జన్మము లేదు. మృత్యువును లేదు. ఆధ్యాత్మిక జగమునందు జీవులు సదా ఏకత్వమున ముక్తులై యుందురు. ఎవడు అజ్ఞాన రహితుడై భగవానుని క్షరాక్షర పురుషుల కంటె అతీతుడుగా, పురుషోత్తమునిగా నెఱుంగునో అట్టివాడు

పూర్ణ మనస్సుతో అచంచల భక్తితో భగవానుని సేవించును, ధ్యానించును.

ఈ ఆధ్యాత్మిక శాస్త్రబోధ అతి రహస్యమైనది. దీని నెరుగుట వలన మనుజుడు జ్ఞానవంతుడు, కృతకృత్యుడు కాగలడు ప్రపంచములో ఏ ఇతర విద్యల చేతను మనుజుడు కృతకృత్యుడు కాజాలడు, కాని ఒక్క బ్రహ్మవిద్యచేతనే, ఆధ్యాత్మిక జ్ఞానము చేతనే అని భగవానుడు స్పష్టముగ చెప్పివైచిరి. మోక్ష ప్రాప్తి సమయమున జీవత్వము తొలగిపోవును. అనగా జీవుడు ఒకానొక కాలమున అంతరించి పోవును. పరమాత్మయో ఏ కాలమున నశింపడు.



# 16. దైవాసుర సంపద్విభాగ యోగము

**భగవానుడు పలికెను :-** అర్జునా! భయం లేకుండా ఉండటం, అంత: కరణ శుద్ధి, జ్ఞాన నిష్టయందుగాని, యోగనిష్టయందు గాని స్థిరత్వం, దానంచేయుటం, బాహ్యవిషయాలనుండి ఇంద్రియాలను నిగ్రహించటం, యజ్ఞ కర్మలు చేయటం, వేదా ధ్యయనం, తపస్సు, మనోవాక్కాయ కర్మలలో నుండటం, భూతదయ, త్యాగం, శాంతం కలిగియుండటం, ఇతరులను గురించి కొండేలు చెప్పకుండగ ఉండటం, విషయలోలత్వానికి గురి కాకుండనుండటం, మృదువుగా మాటలాడటం, లజ్జ కలిగియుండటం, చపలత్వం లేకుండా నుండటం, ఓర్పు, ధైర్యం, శౌచం కలిగియుండటం, ద్రోహబుద్ధియును, స్వాతి శయమును లేకండగ నుండటం, ఇటువంటి గుణసంపద దేవతాంశ సంభూతులైన వారిలో ఉంటుంది.

దంభం, గర్వం, స్వాతిశయం, క్రోధం, కఠినంగా మాట్లాడటం, అజ్ఞానం వంటి గుణసంపద అశురాంశతో పుట్టిన వారిలో ఉంటుంది.

దైవీ సంపద వల్ల మోక్షము, అసుర సంపద వలన బంధమును కలుగుతాయి. నీవు దేవతాంశ వల్ల పుట్టావు కాబట్టి విచారించాల్సిన పని లేదు, అన్ని దుర్గుణములకు భయమేపునాది. ఈ లోకంలో భూతసృష్టి దైవమని, అసురమని రెండు రకాలు. ఇంతవరకు దైవసృష్టి గురించి నీకు చాలా విషయాలు చెప్పాను. ఇపుడు అసుర సృష్టి గురించి చెపుతాను.

అసురగుణాలు కలవారికి దేనియందు ప్రవృత్తి కలగాలో, దేనియందు నివృత్తి కలగాలో తెలియదు. వారిలో శుచి, ఆచారం, మంచి నడవడిక యుండదు. అసురగుణాలు కలవారు ఈ జగత్తుకు ఉనికి లేదని, దీనికొక కారణం లేదని, ఈ జగత్తును నియమించే శక్తి లేదని, సంకల్పమే దీనికంతా కారణమని చెపుతారు. జగత్తే లేదను అసుర గుణాలు గల నష్టాత్ములును, అల్పబుద్ధులును, క్రూరకర్మలును లోక కంటకులైన వారును లోకనాశనం కొఱకే పుడుతూఉంటారు. అసుర గుణాలైన దంభం, దురభిమానం, గర్వం, మితలేని కోరికలు కలిగి అవివేకంతో వారు నీచాతి నీచంగా వ్యవహరిస్తూ యుంటారు. అసుర ప్రవృత్తి గలవారు చావుతోగాని ముగింపు లేని ఎడతెగని

చింతలను పొంది కామోపభోగమే పరమ పురుషార్థమని, అంతకంటె కోరదగిన దేదిలేదని వారు నిశ్చయిస్తూవుంటారు. వారు అనేకాలైన ఆశాపాశాలతో బంధింపబడి, సదా కామ క్రోధాలకు లోనై తమ కామ భోగతృప్తి కొఱకు అన్యాయంగా ఇతరుల ధనాన్ని ఆపేక్షిస్తూవుంటారు.

ఈ కోర్కెను నేను నెరావేర్చుకున్నాను, ముందు ముందు ఇంకా పొందగలను. ఇంత ధనాన్ని సంపాదించాను, ఈ శత్రువులను చంపాను, మిగిలిన వాళ్ళను గూడా చంపివేస్తాను, ఈశ్వరుడు, భోగి, సిద్ధుడు, బలశాలి, సుఖి, ధనికుడు, కులీనుడు, ఏదన్నా నేనే. నాతో సమానమైన వాడు లేడు, నేను యాగాల్ని, దానాలను చేస్తున్నాను, ఆనందం అనుభవించ గలను అనుకొంటూ, ఈ విధంగా అజ్ఞానంతో అహంకార ప్రధానమైన చిత్తముతో , అనేక విధాల మనస్సు చెదరగొట్టుకొని చివరకు మోహమనే వలలో చిక్కుకొని, కామ భోగాలు విడువలేక చచ్చి, కల్మషపూరితమైన నరకంలో పడుతున్నారు.

తమ్ముతాము గొప్పగా తలచుకొనేవారును, వినయం లేనివారును, ధనమధాందులైనవారును

నామ మాత్రపు యజ్ఞాలను డంబంతో శాస్త్ర విరుద్ధంగా చేస్తూవుంటారు. అట్టి అసురులు తమ దేహంలోను సాక్షిగా నున్న నన్ను అసూయాపరలై ద్వేషిస్తూయుంటారు.

అర్జునా! అసురజన్మలెత్తిన మూఢులు తిరిగి వారు ప్రతీజన్మలోను నన్ను పొందే మార్గం తెలిసికొనలేక అంతకంటే నీచ జన్మలెత్తుతూ ఉంటారు. కామ, క్రోధ, లోభాలనే గుణాలు నరక ద్వారాలు. ఇవి ఆత్మ వినాశనానికి దారి తీస్తాయి అందువల్ల ప్రతివారు ప్రయత్న పూర్వకంగా వీటినుండి తప్పించుకోవాలి. నరక ద్వారాలైన ఈ ముడుగుణాల్ని వదలి పెట్టినవాడు ఆత్మహితం గావించుకున్నవాడై మోక్షాన్ని పొందుతాడు. అందువలన ఇది చేయవచ్చునా? చేయకూడదా? అనే సందేహం వచ్చినపుడు నీకు శాస్త్రమే ప్రమాణం. శాస్త్రంలో విధించి యున్న పద్దతి తెలిసికొని, నీవు కర్మచేస్తూ ఉండాలి. అన్నాడు శ్రీ కృష్ణ పరమాత్మ.



# 17. శ్రద్ధాత్రయ విభాగ యోగము

**అర్జునుడు పలికెను :-** " కృష్ణా ! ఎవరు శాస్త్రవిధిని అనుసరింపక శ్రద్ధతో యజ్ఞాలు చేస్తుంటారో వారి కర్మనిష్ఠ సాత్విక, రాజస, తామస గుణాలలో దేనికి చెందుతుంది" అని అడిగాడు.

**భగవానుడు పలికెను :-** అర్జునా! శ్రద్ధ అనేది వారి వారి స్వభావాలను పట్టి యుంటుంది. అది త్రిగుణాల్ని బట్టి మూడు విధాలు. చెప్తాను, విను, శ్రద్ధ అనేది అందరికి వారి వారి పూర్వజన్మ సంస్కారాన్ని బట్టి వచ్చిన ఆంత: కరణానికి అనుకూలమైన రూపంలో కలుగుతూ ఉంటుంది, ఎవ్వనియందు ఎట్టి శ్రద్ధ ఉందో అటువంటి శ్రద్ధను బట్టియే వాని ప్రవృత్తి నిరూపించ-బడుతుంది. సత్త్వ గుణమునందు నిలిచిన వారు దేవతలను, రజోగుణమునందు నిలిచిన వారు యక్ష రాక్షసులను, తమో గుణము నందు నిలిచినవారు భూత ప్రేతములను పూజింతురు. శాస్త్రవిహితము కానటువంటి తీవ్రమగు తపస్సులను దంభా హంకారములతో ఒనరించువారును, కామ, రాగ, బలం, అనే వానితో కూడి శరీరమునందుండే భూతసముదాయాన్ని, హృదయంలో నుండే నన్ను

కూడా కృశింప చేస్తూ, శాస్త్రవిహితం కాని ఘోర తపస్సు చేసే అవివేకులు అసుర సంపద కలవారని గ్రహించు. దేహఆరోగ్యము కొరకు అప్పడప్పడు ఉపవాసము మంచిదేయైనను, అది మితము తప్పియుండ రాదు. వాస్తవంగా తపస్సనగా అంత: కరుణమునందుగల దోషములను భస్మమొనర్చుట యేగాని దేహాదులను క్షణింపజేయుట కాదని ఎఱుంగుము.

ఆహర విషయంలో గూడా వారి వారి గుణ స్వభావాలను బట్టి మూడు రకాలు. అదే విధంగా వారు చేసే యజ్ఞ, దాన, తపస్సులు గూడా మూడు రకాలు గానే ఉంటాయి వాటిని గురించి చెపుతాను విను. ఆయువును, సత్త్వగుణమును, బలమును, ఆరోగ్యమును, సౌఖ్యమును ,సంతోషమును వృద్ధి చేసేవియు, రసము, చమురు, కలిగినవియును, స్థిరాలును, హృదయనికి శాంతి నిచ్చేయునైన పదార్ధములు సత్త్వగుణం కలవారికి యిష్టం.

కారం, పులుపు, ఉప్ప, మిక్కిలి వేడి, ఘాటు కలవియు, చమురు లేనివి, ఎక్కువగా దాహం కలిగించేవి, దుఃఖాన్ని, శోకాన్ని కలిగించేవి అయిన పదార్ధములు రజోగుణం కలవారికి యిష్టం. వీటివల్ల

దు:ఖ, శోక, రోగాలు కలుగుతాయి.

తమోగుణ ప్రధానులకు వండిన తరువాత జాము కంటె ఎక్కువగా నిలువ ఉన్నవి, రసం లేనివి, చెడువాసనలవి, చలిదియు, ఎంగిలిదియు, యజ్ఞశేషం కానిదియు నైన ఆహారం యిష్టంగా వుంటుంది.

శాస్త్ర విహితమైన దాన్ని చేయాలనే స్ధిర నిశ్చయంతో ఫలాన్ని కోరుకొనకుండగ చేసే యజ్ఞం సాత్త్విక యజ్ఞమనబడుతుంది. స్వర్గాది భోగాలు కోరుకుంటూనే, దంభం కొరకు చేసే యజ్ఞాలు రాజసమవుతాయి. శాస్త్రవిధి ననుసరింపక, అన్నదానం లేక, మంత్రయుక్తం గాక, దక్షిణలు లేక, శ్రద్ద లేక చేసే యజ్ఞం తామసమవుతుంది.

సృష్టి శక్తులనబడే దేవతలను, ఆత్మజ్ఞులైన బ్రాహ్మణులను, తత్త్వజ్ఞులైన పండితులను పూజించుటయు, శుచి, బ్రహ్మ చర్యం, అహింస శరీర సంబంధమైన తపస్సులనబడుతాయి. ఇతరులకు బాధ కలిగించని సత్యాన్ని, ప్రియమును, హితకరాలైన మాటలను పల్కటం, వేదాభ్యాసం అనేవి వాఙ్మయి తపస్సు అనబడుతుంది. మనోనిర్మలత, క్రూరత్వం

లేకుండా ఉండటం, మౌనం, మనోనిగ్రహం, నిష్కపట స్వభావం మనస్సునకు సంబంధమైన తపస్సు అవుతుంది. ఫలాపేక్ష లేకుండగా శ్రద్దతో చేసే పై మూడు రకాలైన శారీరక, వాఙ్మయి, మానసిక తపస్సులను సాత్త్వికాలైన తపస్సులని చెపుతారు.

ఒకరు తన్ను సత్కారం చేయాలనిగాని, గొప్పగా చెప్పకోవాలనిగాని, పూజించాలనిగాని, డంభంతోచేసే తపస్సు రాజస తపస్సు అనబడుతుంది. తన శరీరానికి బాధ తెచ్చుకొనిగాని, ఇతరులను బాధపెట్టే ఉద్దేశ్యంతోగాని, మూర్ఖపు పట్టుదలతో గాని చేసేది తామస తపస్సు అవుతుంది.

దేశకాల పాత్రల నెరింగి దానం చేయటం తనకు విధిగా తలంచి తనకు ఉపకారం చేయని వానికి చేసిన దానం సాత్విక దానమవుతుంది. ప్రత్యుప కారంగాని, ఫలాన్ని కోరుకొనిగాని, తప్పనిసరి అనిగాని చేసే దానం రాజసదానమవుతుంది. దేశకాల పాత్రలు లెక్కపెట్టక పుచ్చుకొనేవారిని సత్కరింపక, అవమానించి యిచ్చేదానం తామసదానం అవుతుంది. అర్జునా! శ్రద్ధ లేకుండా చేసే యజ్ఞ, దాన, తపస్సులు అసత్తని చెప్పబడుతాయి. అటువంటి వాటివలన ఇహపరలోకంలో ఎలాంటి ఫలితం ఉండదు.

## 18. మోక్ష సన్యాస యోగము

మోక్షమనగా బంధము నుండి, సంసారిక దు:ఖముల నుండి, జనన మరణములు నుండి విడుదల. సన్యాసమనగా స్వర్గాది ఫలాలనిచ్చే కామ్యకరల్ని విడిచిపెట్టడం. త్యాగమనగా అన్ని కర్మల్ని చేస్తూనే వాటివల్ల వచ్చే ఫలితాన్ని ఆశించకుండ నుండటం అని భగవానుడు పలికెను.

ఓ పార్థా! యజ్ఞము, దానము, తపస్సు అనెడి కర్మలను ఎన్నడును త్యజించరాదు. వాటిని తప్పక ఒనరించవలెను.

ఈ కర్మలన్నింటిని సంగత్వము గాని, ఫలా-పేక్షగాని లేకుండా స్వధర్మమని భావించి చేయవల-యును. మోహకారణమున ఎవ్వరేని తన నియమిత కర్మల్ని విడిచినచో అది తామస త్యాగమవుతుంది. శరీరానికి కష్టమనే భయంతో కర్మల్ని విడిచిపెట్టి నట్లయితే అది రాజస త్యాగమవుతుంది. " ఇది మనకు చేయదగినది " అని విధిగా చేయదగిన కర్మలకు సంగము, ఫలము విడిచిపెట్టి చేయుటయే సాత్విక త్యాగమనబడుతుంది. దేహధారియైన వానికి కర్మలను

త్యజించుట అసాధ్యమైన విషయము. కాని కర్మఫల త్యాగమొనర్చిన వాడు నిజమైన త్యాగి యనబడును.

అర్జునా ! సాంఖ్య సిద్ధాంతంలో సమస్త కర్మసిద్ధికి ఐదు కారణాలు చెప్పబడియున్నాయి. వాటిని చెపుతాను.విను. శరీరం మొదటి కారణం. ఈ శరీరాన్ని చైతన్యవంతంగా పని చేయించే కర్త అయిన జీవాత్మ రెండవ కారణం. ఇంద్రియాలు, మనస్సు మూడవ కారణం. ఆ ఇంద్రియాలతో చేసే క్రియలు నాల్గవ కారణం. అయిదవది దైవం అని చెప్పబడియుంది. మానవుడు శరీరంతోగాని, వాక్కుతోగాని, మనస్సుతోగాని, న్యాయమైన లేక అన్యాయమైన ఏ కర్మచేసినను దానికి ఈ ఐదున్నూ కారణమై యున్నవి. ఈ విధంగా కర్మ జరిగేందుకు ఐదు కారణాలుండగా ఎవడు తానే కర్తయని భావించునో అటువంటి వాడు 'బుద్ధిహీనుడు.' ఎవనికి "నేను కర్తను" (నేను చేయుచున్నాను) అను తలంపు లేదో ఎవని యొక్క బుద్ధి విషయములను, కర్మలను అంటదో అతడీ ప్రాణులన్నిటిని చంపినను వాస్తవముగా దేనిని చంపినవాడు కాదు, మరియు కర్మలచే బంధింపబడడు.

జీవులు తమ పూర్వకర్మానుసారము వివిధ దేహములను ధరించుచున్నను వాటి అన్నింటియందును ఏకమైన ఆత్మ ఒకటే కలదు. సర్వదేహములందలి ప్రాణశక్తి శ్రీ కృష్ణ భగవానుని దివ్య చైతన్యము వలననే కలుగుచున్నది. అట్టి దివ్యచైతన్యమును ప్రతి దేహము నందును గాంచుట సత్త్వగుణవీక్షణ మనబడును. ఏ జ్ఞానము ద్వారా భిన్న శరీరములందు భిన్న జీవులునట్లు మనుజుడు గాంచునో అట్టి జ్ఞానము రజోగుణ సంబధమైనది. ఏ జ్ఞానము ద్వారా మనుజుడు అల్పమైనట్టి ఒకానొక కార్యమందు నిమగ్నుడై కారణము, సత్యావగాహన లేకుండ అదియే సర్వస్వమనెడి భావనలో ఆసక్తుడగునో అట్టి వాని జ్ఞానము తామస జ్ఞానమనబడును.

నియమబద్ధమైనదియు, సంగరహితముగను, రాగద్వేష రహితముగను, ఫలాపేక్ష లేనటువంటిదియు నగు కర్మ సత్త్వగుణము నందున్నట్టిదిగా చెప్పబడును. తన కోరికలను ఈడేర్చుకొనవలెనని భావించి మిథ్యాహంకారముతో అతి ప్రయాసతో కూడి ఒనర్చబడు కర్మ రజోగుణ ప్రధానమైనది. శాస్త్రనిర్దేశములను నిరశించి ముందు కలుగబోవు

దు:ఖాలను,బాధలను, తన సామర్థ్యమును ఆలోచింపక అవివేకముతో చేయబడు కర్మ తామస కర్మయ-నబడును.

కర్మసంగము వదలినవాడును, అహంకారము లేనివాడును, ధైర్యోత్సాహములు కలవాడునై కార్యం సిద్ధించి నా సిద్ధించక పోయినా సుఖ దు:ఖ వికారాలు పొందని కర్త సాత్త్వికుడనబడతాడు. ప్రాపంచిక విషయాల మీద అనురక్తితో, కర్మఫలాన్ని కోరుకొంటూ, లోభియు, హింసచేయువాడును అయి, శుచి లేకుండగ నడుచుకొంటూ, ఇష్ట వస్తు ప్రాప్తిచేత సంతోషమును, అదిలేనినాడు విచారాన్ని పొందుతూ ఉండే కర్త రాజసుడని చెప్పబడతాడు. యుక్తమైన నడవడి లేనివాడును, పామర స్వభావియు, నమ్రత లేనివాడును, వంచనా పరుడును, మందుడును, విషాదయుక్తుడును, దీర్ఘసూత్రియు నైన కర్త తామసుడనబడతాడు.

ఇది ప్రవృత్తి. ఇది నివృత్తి అని, ఈ కార్యం చేయువచ్చును, ఇది చేయకూడదు అని, ఇది భయహేతువు, దీనిలో భయంలేదని ఇది బంధకారణం, ఇది మోక్ష కారణమని వివేకంతో ఈ విధంగా

తెలిసికోనగలిగిన బుద్ధి సాత్త్వికమవుతుంది. ధర్మాధర్మాల్ని, కార్యకార్యాల్ని సరిగా గ్రహించలేని బుద్ధి రాజసమవుతుంది. అజ్ఞానంతో ఆవరింపబడి, అ ధర్మాన్ని ధర్మంగా భావిస్తూ ఒక విధంగా ఉన్నదానిని వేరొక విధంగా ఉన్నదనుకొనే బుద్ధి తామస బుద్ధి అనబడుతుంది.

ఏ ధైర్యముచే మనుజుడు తన మనస్సును, ఇంద్రియములను విషయ భోగముల నుండి నిరోధించునో, దృశ్య వ్యామోహము నుండి నివృత్తిడగునో అదియే సాత్త్విక ధైర్యము, ఏ ధైర్యము చేత మనుజుడు ఫలాపేక్షగలవాడై ధర్మమును, కామమును మిగుల ఆసక్తితో అనిష్టించు చున్నాడో అది రాజసధైర్యము, ఏ మనుజుడు నిద్రను, భయమును, దు:ఖమును, దిగులును, మదమును విడువకుండునో అది తామస ధైర్యము.

ఏ సుఖము ప్రారంభమున విషము వలెనను, పర్యవసానమున అమృతమును బోలినదిగను. యుండునో అట్టి సుఖము సాత్త్విక సుఖమనబడును. ఏ సుఖము విషయేంద్రియ సంబంధము వలన మొదట అమృతమును బోలి అంతమున విషమువలె

నుండునో అట్టి సుఖము రాజససుఖమనబడును. మొదటి నుండి చివరి వరకు శరీరాన్ని మరిపించి నిద్ర, సోమరితనము, ప్రమత్తత అనువాని వలన పుట్టినదై, అజ్ఞానము, భ్రమను కలుగజేయుచున్నదో అట్టి సుఖము తామససుఖమని చెప్పబడును.

ప్రకృతి నుండి పుట్టినవగు ఈ మూడు గుణములతో కూడియుండని వస్తువు ఈ భూలోకమందుగాని, స్వర్గలోకమందుగాని, దేవలోకమందుగాని ఎచటనులేదు.

బ్రాహ్మణ, క్షతియ, వైశ్య, శూద్రులకు వారి వారి (జన్మాంతర సంస్కారముల ననుసరించి) స్వభావము వలన పుట్టిన గుణములను బట్టి కర్మలు వేరు వేరుగా విభజింపబడినవి. అంతరేంద్రియ బాహ్యేంద్రియ నిగ్రహము, తపస్సు, శుచిత్వము, ఓర్పు, ఋజుప్రవర్తన, శాస్త్రజ్ఞానము, అనుభవజ్ఞానము, ఆస్తిక భావము అను ఈ తొమ్మిది కర్మలున్ను బ్రాహ్మణులకు స్వభావముగ నుండును. సూరత్వము, తేజస్సు, కీర్తి, ప్రతాపము, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమునందు వెనుకకు మరలకుండుట, దానము, ప్రజాపాలనము ఇవి క్షత్రియ కర్మలనబడును. వ్యవసాయము, గోసంరక్షణ, వర్తకము

వైశ్యునకు స్వభావజనితములగు కర్మలైయున్నవి. అట్లే సేవా రూపమైన కర్మలు శూద్రునకు స్వభావ సిద్ధమై యున్నవి. స్వకీయ కర్మచే భగవానుని ఆరాధించినచో (నిష్కామబుద్ధితో) దానితో జ్ఞానము, మోక్షము లభించుచున్నని. స్వభావ సిద్ధమగు కర్మ దోషయుక్తమైనను దానిని వదలరాదు. ఎందుకంటె పొగచేత అగ్ని కప్పబడి యున్నట్లు సమస్త కర్మలును దోషము చేత కప్పబడియున్నవి. తన స్వభావానికి తగిన కర్మల్ని వదలిపెట్టి ఇతర కర్మల్ని ఎంత నైపుణ్యముతో చేసినను దు:ఖం తప్పదు.

బుద్ధిని నిర్మలముగా నుంచి ధైర్యముచే ఇంద్రియమనంబులను స్వాధీనపరచుకొని శబ్ద, స్పర్శాది విషయములను త్యజించి రాగ ద్వేషములను వదలిపెట్టి, ఏకాంత స్థలము నాశ్రయించి వాక్కును, శరీరమును, మనస్సును స్వాధీనము నందుంచుకొని నిరంతరము ధ్యాన యోగ తత్పరుడై , వైరాగ్యము లెస్సగ నాచరించుచు, అహంకారము, దర్పము, కామము, క్రోధమును వదలిపెట్టి, శాంతిచిత్తుడై యుండి ఇంద్రియ మనంబులను ధైర్యముతో నిగ్రహించువాడు బ్రహ్మమును పొందును. అట్టి మహనీయుడు నిర్మల

మనస్సు గలవాడై దేనిని గూర్చి దు:ఖింపడు, దేనిని కోరడు. సర్వాభూతముల యందు సమభావము కలిగి వానిని తనవలె భావించుచుండును. కేవలము భక్తి చేతనే మనుజుడు నన్ను దేవ దేవుడని అవగాహన చేసికొనగలడు. అట్టి వాడు మాత్రమే నా ధామము చేరుచున్నాడు (నాలో ప్రవేశిస్తున్నాడు)

సమస్త కర్మలు ఎల్లప్పడు చేయుచున్నవాడైనను కేవలము నన్నే ఆశ్రయించువాడు నా అనుగ్రహము వలన నాశరహిత మోక్షపదమును బొందుచున్నాడు. ఉదా :- శిరస్సు పై ఉదక కుంభము నుంచుకొని నృత్యమొనర్చు స్త్రీ నోటితో పాట పాడినను, చేతులతో కాళ్ళతో నాట్యమాడినను ఆమె మనస్సు మాత్రము శిరస్సు పై గల ఉదక కుంభముపైనే యుండునట్లు సమస్త కార్యములను సదా చేయుచున్నను, ఎవరి మనస్సు భగవానుని పై ననే లగ్నమై యుండునో అతడు భగవదను గ్రహమునకు పాత్రుడై ముక్తి నొందగలడు.

ఓ పార్థా ! వివేకంతో సర్వకర్మల్ని (కర్మఫలములను) నా యందు సమర్పించి నన్నే పరమగతిగానెంచి నా యందే చిత్తము నిల్పుము. <u>అట్లు నా యందు చిత్తము చేర్చిన వాడవైతివేని నా</u>

అనుగ్రహము వలన సమస్త దు:ఖములను దాటగలవు. ఒకవేళ అహంకారముచేగాని, ధనబలముచేగాని, అధిక గర్వముచేగాని నాయీ వాక్యములపై విశ్వాసముంచనిచో నానా బాధలు తప్పవు.

అర్జునా ! అజ్ఞాన మోహంతో నీవీ కర్మ చేయడానికిష్టపడకపోయినను నీ స్వాభావిక గుణముచేత ప్రేరేపింపబడినవాడవైనద్దాని తప్పక చేసియే తీరుదువు.

జగన్నియామకుడైన పరమేశ్వరుడు సమస్త ప్రాణుల యొక్క హృదయమునందు నిలిచి తన మాయా శక్తి చేత ప్రకృత్తి యంత్రంలోనున్న భూత కోటినంతటిని త్రిప్పుతూ ఉంటాడు. యంత్రము యొక్క పెద్దచక్రములో చిక్కుకున్న చీమ, దోమ ఆ చక్రముతోపాటే తిరుగుచున్నట్లు జీవులున్ను ఈ సంసార చక్రమున తగుల్కొని ఆ చక్రముతో పాటు వివశులై తిరుగుచున్నారు. సకల జీవుల యొక్క హృదయ స్థానమున ఏ పరమాత్మ నివశించు చున్నాడో వారిని సర్వవిధముల శరణు పొందుటయే బంధ విముక్తి కి ఏకైక మార్గము. ప్రాపంచిక శక్తులన్నియు మాయా శక్తికి, మాయా శక్తి దైవ శక్తికి లోబడియున్నవి.

ఇంత వరకు పరమ రహస్యమైన జ్ఞానమును నీకు బోధించితిని, దీనినంతటిని బాగుగా విచారణ చేసి నీ కెట్లు యిష్టమో అట్లాచరింపుము. నీవు నాకు పరమప్రియుడవైయుండట వల్ల నీకు హితమైన యింకొక మాట చెపుతాను విను. ఇది అన్నింటికంటె పరమరహస్యం. నా యందు మనస్సు నుంచుము. నాయెడల భక్తి కలిగియుండుము. నన్నారాధింపుము. నాకు నమస్కరింపుము. అట్లు చేసెదవేని నీవు నన్ను పొందగలవు. ఇది ప్రతిజ్ఞ చేసి చెపుతున్నాను.

66 : శ్లో :- సర్వ ధర్మాన్పరిత్యజ్యమామేకం శరణం వ్రజ
అహం త్వాసర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచ:

తా॥ సమస్త ధర్మములను విడిచి పెట్టి నన్నొక్కనిని మాత్రము శరణు బొందుము. నేను సమస్త పాపముల నుండి నిన్ను విముక్తిని చెసెదను.

పాపముచే దు:ఖము, పుణ్యముచే సుఖము, జ్ఞానము లేక భగవచ్ఛరణా గతిచే మోక్షము కలుగును, ఎవడు అతి రహస్యమైన ఈ గీతా శాస్త్రమును నా భక్తులకు బోధించునో అట్టివాడు నాయందు ఉత్తమ భక్తిగలవాడై, సంశయపాపరహితుడై నన్ను బొందును. ఈ ప్రపంచమున భగవంతునికి మిక్కిలి ప్రియమొ

నర్చువాడు గీతా తత్త్వమును భగవత్భక్తులకు బోధించువాడు. ఎవడు ధర్మయుక్తమైన మన ఇరువురి ఈ సంభాషణమును ఆధ్యయనము చేయునో అట్టి వానిచే జ్ఞానయజ్ఞము చేత నేనారాధింపబడిన వాడనగుదునని నా నిశ్చయము. ఏ మనుజుడు శ్రద్ధతో గూడినవాడై, అసూయలేనివాడై ఈ గీతా శాస్త్రమును వినునో అట్టివాడు పాప విముక్తుడై పుణ్య కార్యములు చేసిన వారి యొక్క పుణ్యలోకములను పొందును. పార్థా! ఏకాగ్రత చిత్తముతో ఈ గీతా శాస్త్రమును విన్నావు కదా ! నీ యొక్క అజ్ఞానముచేత కలిగిన మోహం పూర్తిగా తొలగిపోయిందా? అని అడిగాడు శ్రీ కృష్ణ పరమాత్మ.

**అర్జునుడు పలికెను :-** అచ్యుతా ! నీ అనుగ్రహం వలన జ్ఞానాన్ని పొందాను. మోహం నశించినది. సంశయాలు తొలగిపోవటం వలన సుస్థిరతను పొందాను. ఇంక నీవు చెప్పినట్లే యుద్ధం చేస్తాను. అన్నాడు అర్జునుడు.

**సంజయుడు ధృతరాష్ట్రునితో ఇట్లు పలికెను :-** రాజా ! నేను శ్రీకృష్ణ పరమాత్మ యొక్కయు, మహాత్ముడైన అర్జుని యొక్కయు. ఆశ్చర్యకరమైన , ఓడలు పులకరింప జేసేదైన ఈ ప్రభోదాన్ని విన్నాను. వ్యాసులు వారిచ్చిన

దూరదృష్టి, దూరశ్రవణము చేత పరమరహస్యమైన ఈ బుద్ధి యోగాన్ని యోగీశ్వరుడైన శ్రీ కృష్ణ పరమ్మాత చెపుతుండగా స్వయంగా విన్నాను. పుణ్యప్రదమైన ఈ శ్రీకృష్ణార్జునుల అద్భుత సంవాదాన్ని తలచుకొన్నప్పుడల్లా పట్టరాని సంతోషం కలుగుతుంది. శ్రీ కృష్ణ పరమ్మాత చూపించిన ఆశ్చర్యకరమైన విశ్వరూపాన్ని మాటి మాటికి తలుచు కొంటూ ఎంతో ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని పొందుతున్నాను. రాజా ! యోగీశ్వరుడైన శ్రీ కృష్ణుడు, గాండీవాన్ని ధరించియున్న పార్ధుడు, ఏ పక్షాన ఉన్నారో ఆపక్షానికి సంపద, విజయము, ఐశ్వర్యము, నీతి తప్పక వుంటాయని నా ఉద్దేశ్యము" అని తన నిశ్చయాన్ని విశదీకరించాడు సంజయుడు.

**శ్రీ మద్భగద్గీత సర్వము సమాప్తము**

ఓం తత్సత్



# ANNEXURE

**మీరు భగవద్గీతను చదివారా?**
**ఈ క్రింది ప్రశ్నలకు మీకు సమాధానం దొరికిందా?**
**లేకపోతే భగవద్గీతను మరల చదివి తెలుసుకోండి.**

1) జీవుడు ఎట్టివాడు? భగవంతుడు ఎట్టివాడు ?
2) జీవునికి భగవంతునికి గల బేధమేమిటి?
3) కర్మ అనగా ఏమి? కర్మలు ఎందుకు చేయవలెను?
4) నైష్కర్మ అనగా ఏమి?
5) జీవునికి జనన-మరణములు ఎందుకు కలుగుచున్నవి?
6) అవి భగవంతునికి ఎందుకు లేవు?
7) జనన-మరణ చక్రముల నుండి విడుదలకు మానవుడు ఏమి చేయవలెను ?
8) సన్యాసి అనగా ఎవరు ?
9) త్యాగి అనగా ఎవరు ?
10) స్థిత ప్రజ్ఞుడు అనగా ఎవరు ?
11) బ్రహ్మిస్థితి అనగా ఏమి ?
12) జ్ఞానం అనగా ఏమి ? దానిని పొందుట వలన కలుగు ప్రయోజనం ఏమి ?
13) విజ్ఞానం అనగా ఏమి ?
14) మాయ అనగా ఏమి ?
15) జీవుడు మాయలో ఎందుకు చిక్కుపడుతున్నాడు? దాని ఫలితమేమి?
16) ఈ మాయను దాటవలెనన్న మనిషి ఏమి చేయవలెను?
17) జీవునికి మంచి జన్మ - నీచ జన్మలు ఎందుకు కలుగుచున్నవి?

18) క్షరము అనగా ఏమి ? అక్షరము అనగా ఏమి?
19) క్షరపురుషుడు అనగా ఎవరు ? అక్షర పురుషుడు అనగా ఎవరు?
20) ప్రకృతి అనగా ఏమి ? పురుషుడు అనగా ఎవరు ?
21) ఆత్మ - పరమాత్మలకు గల బేధమేమి ?
22) జంగములు స్థావరములు అనగా ఏమి?
23) ప్రాణులకు స్థావరములకు గల బేధమేమి ?
24) క్షేత్రము అనగా ఏమి ?
25) క్షేత్రజ్ఞుడు అనగా ఎవరు ?
26) శిశువు జననము ఎట్లు కలుగుచున్నది ?
27) మరణము ఎట్లు కలుగును ? ఆ తరువాత ఏమి జరుగును?
28) గుణములు అనగా ఏవి ? వాటి ప్రభావం ఎట్లుండును ?
29) పంచభూతములు అనగా ఏవి?
30) కర్మేంద్రియములు-జ్ఞానేంద్రియములు అనగా ఏవి ?
31) కర్మ చేయకుండా మానవుడు జీవించగలడా?
32) మనిషికి మిత్రులు ఎవరు ? శత్రువులు ఎవరు?
33) బ్రహ్మదేవుని కాలపరిమితి ఎంత ?
34) యుగ చక్రమనగా ఏమి ?
35) ప్రళయము ఎప్పుడు సంభవించును ?
36) దక్షియాణము - ఉత్తరాయణములలో చనిపోయిన వారికి ఎట్టి గతి కలుగును ?
37) ఈ కలియుగము ఎప్పుడు సమాప్తమవుతుంది ?
38) కల్కి భగవానుడు ఎప్పుడు అవతరించును ?

**ప్ర. కర్మ, అకర్మ, వికర్మ అనగా ఏమి ?**

జ :- కర్మ అనగా కర్మేంద్రియములతో జరిగే ప్రతి పనిని కర్మ అంటారు. అంటే ముక్కుతో పీల్చే గాలి (శ్వాస క్రియ) కూడా కర్మ అనబడుతుంది.

అకర్మ అనగా కర్మ చేసినను అది మంచిది గాని చెడ్డది గాని దాని ఫలితాన్ని భగవానునికి అర్పించినచో (కృష్ణార్పణము). దాని ఫలితము కర్మ చేసిన వానికి అంటదు. అందువల్ల అతడు కర్మ చేసినను కర్మ చేయనట్లే అగును. దానిని నిష్కామ కర్మ అని కూడా అనబడుతుంది. అందుకే శ్రీకష్ణ పరమాత్మ అర్జునునితో చెప్తాడు అర్జునా! నీవు నిష్కామ బుద్ధితో ఈ యుద్ధ భూమిలో ఉన్న వారందరినీ చంపినను నీకు ఏ పాపము అంటదు. అంటే అధర్మమముగా చంపమని కాదు. ధర్మముగా చేసే పని ఏదైనను దానిని నిష్కామ బుద్ధితో చేసినట్లైతే నీకు ఎలాంటి పాపము అంటదు. అని అర్థం. అట్లు చేయుట వలన పుణ్యము గాని పాపము గాని నీ ఖాతాలో ఏమి ఉండదు. నీ ఖాతాలో పుణ్య - పాప ఫలితం ఏదీ లేకపోయినట్లైతే నీకు మరల జన్మించవలసిన అవసరం ఉండదు. అదే మోక్షము. అంటే పరమాత్మలో లీనమైపోవును.

వికర్మ అనగా చేయదగని కర్మ. అనగా శాస్త్ర విరుద్ధమైన కర్మ. అట్టి కర్మ చేయుట వల్ల పాపమే గాని పుణ్యము దక్కదు.

**ప్ర. 2. సంచిత కర్మ అనగా ఏమి ? ప్రారబ్ధ కర్మ అనగా ఏమి?**

జ. ప్రతి మనిషి ప్రతి నిమిషము ఏదో ఒక కర్మ చేస్తూనే ఉంటాడు. కర్మ చేయక ఒక్క క్షణము కూడా ఉండలేడు. అట్లు చేసే కర్మలలో కొన్నివి మంచివి ఉండవచ్చు కొన్ని చెడ్డవి ఉండవచ్చు. మంచి కర్మల వలన పుణ్య ఫలము, చెడు కర్మ వలన పాప ఫలము మూటగట్టుకోవడం జరుగుతుంది. ఇప్పుడు చేసిన కర్మలన్నింటి పుణ్య-పాప ఫలితాలు ఈ జన్మలోనే అనుభవించవలసి వచ్చును లేదా తరువాత జన్మతో అనుభవించవలసి వచ్చును. ఈ జన్మలోనే అనుభవించిన పుణ్య-పాప కర్మల ఫలితాలను **సంచిత కర్మలు** అంటారు. ఇంకా మిగిలిన కొన్ని పుణ్య-పాప కర్మల ఫలితాలు అనుభవించక ముందే జన్మ చాలించినచో (అనగా మరణించినచో) అట్టి పుణ్య పాప కర్మల ఫలితాలు అనుభవించుటకు మరల జన్మించి అనుభవించవలసి వచ్చును. అట్టి ముందు జన్మలో చేసిన పుణ్య-పాప కర్మల

ఫలితాలు ఈ జన్మలో అనుభవించుటయే ప్రారబ్ధ కర్మ అనబడుతుంది.

మీరు కేవలము ఒక 20 మందికి 20 గ్రంథములు ఉచిత వితరణ చేయండి. (20 గ్రంథముల వెల రూ॥ 800/-లు) మీరు చేసే ఈ చిన్న జ్ఞాన దానము కేవలం 20 మందికి మాత్రమే చేసినామని అనుకోవడం పొరబాటు అవుతుంది. ఎందుకంటే అది కొన్ని వేలు, లక్షల మందికి జ్ఞాన దానము కలుగజేస్తుంది. ఎట్లా అంటే మీరు 20 మందికి ఉచిత గ్రంథము వితరణ చేసిన తరువాత ఆ 20 మంది మరొక 20 మందికి చేస్తారు. అంటే 20x20 = 400 మంది ఆ మరో 400 మంది ఒక్కొక్కరు మరో 20 మందికి చేసత్తాంటారు. అనగా 400x20 = 8000 మందికి జ్ఞానదానము చేసినట్లవుతుంది. ఆ విధంగా ఈ ప్రక్రియ కొనసాగుతూనే కొన్ని లక్షల మందికి జ్ఞాన దానం కలుగజేస్తుంది. ఇప్పుడు మీరు ఆలోచించండి మీరు చేసినది ఒక చిన్న కార్యమా? ఈ జన్మలో మీరు చేసిన ఈ పుణ్యము పెరిగి పెరిగి అనంతమైన పుణ్య ఫలం మీ ఖాతాలో జమ అవుతూనే ఉంటుంది. ఈ జ్ఞాన దానం సంపాదించిన పుణ్య ఫలం మీకు మరో జన్మ అంటూ ఉంటే ఒక గొప్ప సిరిసంపదలు

లేక జ్ఞానవంతులైన ఇళ్ళలో జన్మను కలుగజేస్తుంది లేదా మోక్ష ప్రాప్తిని కలుగజేస్తుంది. కాబట్టి మీరు ఈ జన్మలో ఎలాంటి పుణ్య కార్యము చేసినా చేయకపోయిన మీ ఖాతాలో పుణ్యం పెరుగుతూనే ఉంటుంది. ఎట్లా అంటే మీరు బ్యాంకులో కొంత ధనం ఫిక్స్డ్ డిపాజిట్ చేస్తే మీ ఖాతాలో వడ్డీ ఎలా పెరుగుతూ ఉంటుందో అదే రీతిలో ఈ జన్మలో మీ ఖాతాలో పుణ్య ఫలం జమ అవుతూనే ఉంటుంది. ఈ ప్రక్రియ కొనసాగుతూనే ఉంటుంది. దీనికి అంతం లేదు.

శుభమస్తు

ఓం తత్సత్

ఇట్లు

భవదీయులు

గ్రంథ రచయిత

**రావూరి వెంకటేశ్వర్లు** B.E.,



ఈ భగవద్గీత గ్రంథము చదివిన వాళ్ళు ఇతరులకు కనీసం 20 గ్రంథములు ఉచిత వితరణ చేయుట ద్వారా 20 మందికి జ్ఞాన దానము చేసినవారు కాగలరు. అన్నదానము కన్నను జ్ఞానదానము ఎంతో విశిష్టమైనది, పుణ్యప్రదమైనది. అప్పుడు మీ జీవితమునకు అర్థము, పరమార్థము లభించును, జీవితము సార్థకము కాగలదు. శ్రీ కృష్ణ భగవానుని అనుగ్రహమునకు పాత్రులు కాగలరు. (20 గ్రంథములు కేవలం రూ॥ 800/-లు మాత్రమే) ఈ క్రింది బ్యాంక్ అకౌంట్‌నకు రూ॥ 800/-లు జమ చేసి మీ పేరు, చిరునామా, ఫోన్ నెం, ఎస్.ఎం.ఎస్. లేదా వాట్సాప్ ద్వారా తెలియజేసినచో మీకు వెంటనే 20 గ్రంథములు పోస్ట్ ద్వారా అందజేయబడును.

ఇట్లు
గ్రంథ రచయిత

 : 9398870210

---

**R. Venkateswarlu**

Bank : **Andhra Bank**
SB A/c. No. : **103410025053495**
Branch : **JNTU, Hyderabad-85**
IFSC Code : **ANDB0001034**

